శ్రీమత్సర్వదేవతాభ్యోనమః

# పాణినీయ శిక్ష

(అవతారికా వ్యాఖ్యా సమన్వితము)

వ్యాఖ్యాత, ప్రకాశకుడు :

సాహిత్య విద్యాప్రవీణ, రాష్ట్ర భాషాప్రవీణ,

**కొల్లూరు అవతారశర్మ,**

**M.A., (Skt.) M.A., (Tel.) B.Sc., B.Ed.,**

ఆంధ్రవిశ్వవిద్యాలయ స్వర్ణపతక పురస్కృతుడు

సంస్కృతోపన్యాసకుడు

S.K.P. ప్రభుత్వ జాతీయ జూనియర్ కళాశాల,

రామచంద్రపురం.

"ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారి

ఆర్థిక సహాయముతో ముద్రితము"

**1979**

శ్రీమత్పరదేవతాయైనమః

# పాణినీయ శిక్ష

(అవతారికా వ్యాఖ్యా సమన్వితము)


వ్యాఖ్యాత, ప్రకాశకుడు :

సాహిత్య విద్యాప్రవీణ, రాష్ట్రభాషాప్రవీణ,

**కొల్లూరు అవతారశర్మ,**

**M.A., (Skt.) M.A, (Tel.) B.Sc., B.Ed.,**

ఆంధ్రవిశ్వవిద్యాలయ స్వర్ణపతక పురస్కృతుడు

సంస్కృతోపన్యాసకుడు

S.K.P. ప్రభుత్వ జాతీయ జూనియర్ కళాశాల,

రామచంద్రపురం.



"ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారి

ఆర్థిక సహాయముతో ముద్రితము"

**1979**

శ్రీమత్పరదేవతాయైనమః

# పాణినీయ శిక్ష

(అవతారికా వ్యాఖ్యా సమన్వితము)

వ్యాఖ్యాత, ప్రకాశకుడు :
సాహిత్య విద్యాప్రవీణ, రాష్ట్రభాషాప్రవీణ,
**కొల్లూరు అవతారశర్మ,**
**M.A., (Skt.) M.A., (Tel.) B.Sc., B.Ed.,**
ఆంధ్రవిశ్వవిద్యాలయ స్వర్ణపతక పురస్కృతుడు
సంస్కృతోపన్యాసకుడు
S.K.P. ప్రభుత్వ జాతీయ జూనియర్ కళాశాల,
రామచంద్రపురం.



మూల్యము :- రు. 6 లు

# అంజలి - ఆశంస

ప్రప్రథమముగా శ్రీమత్పరదేవతాపదచరణములకు;

తదుపరి

ఏతద్గ్రంథ పరిష్కారమున కన్నివిధముల తమసహాయ సహకారములందిచ్చిన నాగురుచరణులు - శ్రీ అప్పల్ల సోమేశ్వరశర్మ (Reader A. U. Sanskrit Dept) గారికి; నా అభ్యర్థనా సమనన్తరమే తమ యమూల్యాభిప్రాయముల చే సన్నను గ్రహించిన ఆంధ్రవిశ్వవిద్యాలయ సంస్కృతాంధ్ర శాఖాధ్యక్షులు శ్రీ పి. శ్రీరామమూర్తి, మఱి యస్వీ జోగారావుగార్లకు; ప్రవేశికారూపమున చక్కటి గ్రంథ పరిచయ వ్యాసమునందించిన నాప్రాణమిత్రుడు శ్రీ నూరం శ్రీనివాసులకు; యీగ్రంథముద్రణకు తగు ఆర్థికసహాయమందిచ్చిన ఆంధ్రప్రదేశ్ సాహిత్యఅకాడమీవారికి; ఏతన్ముద్రణకై నాకనుమతినొసంగిన ఆంధ్రప్రదేశ్ విద్యాశాఖడైరక్టరువారికి; చాలవరకు నిష్కష్టముగా ముద్రణకార్యమునతిదక్షతతో నిర్వహించిన ఆనందతీర్థప్రెస్ ప్రొ॥ శ్రీ చాగంటి సత్యనారాయణ మూర్తిగారికి నాకృతజ్ఞతాంజలు లర్పించుకొనుచున్నాను.

అనంతరము, ముద్రణకార్యము చాలవరకు తనకుతానుగా నిర్వహించి సకాలములో ముద్రణపూర్తియగుటకు తోడ్పడిన నాశిష్యశిరోమణి చి॥ చేసెట్టి వీరవెంకటసత్యనారాయణ మూర్తికి నా శుభాశంసనములు.

—గ్రంథకర్త.

ఆంధ్రప్రదేశ్ ఉన్నత విద్యాశాఖాధివారి
ముద్రణానుమతిపత్రము.

PROCEEDINGS OF DIRECTOR OF HIGHER EDUCATION: A.P. HYDERABAD.

Rc.No. 10336/ICI. 5/78 Dt 16-1-1979.

Sub: APESS-Sri K. Avatara Sarma, JL in Sanskrit, G.J.C, Ramachandrapuram - Permission to publish book - Accorded - Reg.

Ref: 1. Endt. No.A/78. Dt. 6-12-78 of the Principal; G.J.C., Ramachadrapuram.
2. G.O.Ms. No. 553/G.A. (Ser.C) Dept., Dt. 8-8-74.

Sri K. Avatara Sarma, Junior Lecturer in Sanskrit, Govt.Junior College, Ramachandrapuram is permitted to publish the Book "Paniniya Siksha" as per G.O.Ms.No.553/G.A. (Ser.C) Department, dated 8-8-74.

K.Ganga Reddy,
for Director of Higher Education.

/ Forwarded by Order /

x x x
Superintendent.

To

Sri K. Avatara Sarma, Junior Lecturer in Sanskrit, Govt. Jr. College, Ramachandrapuram through the Principal.

Copy to the Principal, Govt. Junior College, Ramachandrapuram.

SC...2.

# అభిప్రాయమంజరి

**ANDHRA UNIVERSITY**
Department of Telugu
University College of Arts, Commerce & Law

From:
Professor:
*S. V. JOGA RAO*
Head, Dept. of Telugu

Waltair,
Visakhapatnam
530003

Date: 4-8-1979.

బహుశ్రుతులు బ్రహ్మనిష్ఠులు, తర్కకర్కశమతులయ్యు రసవశంవద మానసులు, భావగంభీరులయ్యు ప్రసన్నహాసన్ముఖులు, వాక్పటుత్వలంపటులయ్యు చారుచమత్కార చతుర భాషణులు బ్రహ్మశ్రీ కొల్లూరు లక్ష్మణమూర్తిశర్మ మహోదయులు. వారి కుఱ్ఱడు చి॥ అవతారశర్మ తండ్రికి తగిన కొడుకు. తాతముత్తాతల పేరుప్రతిష్ఠలు నిలబెట్టగలవాడు. కుఱ్ఱవాడైనను పెద్దబుఱ్ఱవాడు. "స్ఫులింగావస్థయా వహ్ని రేధాపేక్షా ఇవస్థితః". సంస్కృతాంధ్రసాహిత్య వ్యాకరణము లందు కృతశ్రముడు. అప్పుడే పాణినీయశిక్షను మఱియొకరికి చెప్పగల చేవగలవాడాయెనన్న ఇక జూచుకొనుడు పాండిత్య రంగమున వాని అజృంభ వీరవిజృంభము — అవకాశము లభించు నదృష్టమును ఆదరించు దాతలు నుండవలె గాని.

షడంగాధ్యయన కూలంకషకృషితో గాని వేదవిద్య పూర్తి కాదు, వేదవేద్యుడు కనిపించడు. ఆ షడంగములలో ప్రథమము శిక్ష. మహేశ్వరవరప్రసాదమహిమానుభావుడై వైదిక లౌకిక సంస్కృతభాషా ఫక్కికలకు సర్వప్రపంచభాషాశాస్త్ర పండితశ్లాఘాఘూశిరఃకంప పాత్రమైన పద్ధతికి వ్యాకరణమును వెలయించిన పాణిని మహర్షియే ఈ శిక్షను వెలయించినాడు. ఇందు వర్ణసంఖ్యా విచారము, వర్ణోచ్చారణము, వర్ణవిభాగము, పాఠక లక్షణము మున్నగు విలువగల విషయములెన్నియో సప్రమాణముగ, శాస్త్రమర్యాదాసనాథముగ చర్చించబడినవి. పలు శిక్షాకృతులప్పటికే యున్నవనిన అవి కేవలము వైదికభాషామాత్రపరిమితములు. పాణినీయ శిక్ష లౌకిక వైదికసంప్రదాయోభయ ఫక్కికము. అందుచే భాషాసామాన్యవిజ్ఞాన కృషీవలులకును పరమోపాదేయమైనది. అట్టి దీనిని సమగ్రవ్యాఖ్యాపూర్వకముగ తెనుగున అవతరింపజేసిన శర్మగారి పూనిక అస్మదాదులందరికిని అవశ్యము ప్రశస్యము. ఈతని నాశ్రయించి గీర్వాణము గీర్వాణము ప్రబలి రాణించును గాక అని నా ఆశాసనము

సం. యస్వీ జోగారావు.

R.S.

DR. P. SRIRAMAMURTI,
M.A., PH.D.,
Professor & Head
Department of Sanskrit,

Andhra University
Waltair.

Date 25-7-79.

' అథ శిక్షాం వ్యాఖ్యాస్యామః ..., ఇత్యాద్యుపనిషద్వాక్యాలలో శిక్షావాఙ్మయం ప్రప్రథమంగా ప్రాదుర్భవించి, ప్రథమ వేదాఙ్గంగా పరిఢవిల్లి, వ్యాస, పాణిన్యాద్య శేష శేముషీవిభవసంపన్నులగు మహర్షుల పవిత్ర వాక్సుధాపూరములతో విశ్వరూపాన్ని దాల్చింది.

శిక్షలన్నిటికిని తలమానికమనదగినది పాణినీయశిక్ష. స్వరవర్ణాది విచారమంతయు వైదికలౌకికోభయ తారకముగ నిందు వివేచింపబడినది. కావున నీగ్రంథము భాషా శాస్త్ర జిజ్ఞాసువులకందరకు పరమోపాదేయమైనది.

ఆంధ్ర భాషలో ఈగ్రంథాన్ని అనువదింపబూనుకొన్న మా అవతారశర్మ ఎంతగానో అభినందింపదగిఉన్నాడు.

P.T.O.

వ్యాకరణశాస్త్రానికికూడ మిక్కిలి ఉపయోగకరమైన ఈశిక్షాగ్రంథం ఎక్కువగా చదవదగింది. వర్ణోచ్చారణ విశేషాలు ఎన్నో ఇందు విశదీకరింపబడినవి.

ఈగ్రంథాన్ని చక్కని గ్రాంథికంలో నిర్దుష్టంగా అనువదించి అమరభారతీసేవచేసిన అవతారశర్మకు నా అభినందనలు ఆశీస్సులు. ఇంకా ఇటువంటి గ్రంథాల్ని తెలుగువారికి అందచేయగలడని నా విశ్వాసం.

ఇట్లు

సం. పోచంచర్ల శ్రీరామమూర్తి.

"Vyakarana Vidyapraveena"
"Sahitya Vidyapraveena"
"Bhashapraveena"
A. SOMESWARA SARMA,
M A., P.O L
Reader
Dept of Sanskrit
(Member, Board of Studies,
Sanskrit P.G.)

Andhra University
Waltair
Date : 9-7-79.

శ్రీః

# ఆ శం స

" అథశిక్షాం వ్యాఖ్యాస్యామః । వర్ణః స్వరః । మాత్రాబలమ్ । సామసంతానః।" మొదలగు వచనములతో ఉపనిషద్వాణి శిక్షకు శ్రీకారము చుట్టినది. వర్ణములు, వానిస్వరూప స్వభావములు. స్థానప్రయత్నాదులు, ఉదాత్తాదిస్వరములు, ఉచ్చారణసంవిధానములు మొదలయిన విషయములను క్షుణ్ణముగా చెప్పు గ్రంథము శిక్ష. వేదములను సంరక్షించుటకును, వాని అర్థతాత్పర్యాదులను అవగాహనము గావించుకొనుటకును ఉపయోగించు వేదాంగములాఱింటిలోను శిక్ష మొట్టమొదటిది. పరిశుద్ధికి సాయపడును గాన ఇది "భాషాంగము" కూడ అగును.

సంస్కృతమున ఇంచుమించు ఏబది శిక్షాగ్రంథములు కనవచ్చును. అన్నిటికన్న ప్రాచీనమైనది "పాణినీయ శిక్ష"

అనియు, దానికర్త పరమవైయాకరణుడు "పాణిని" అని యును సాంప్రదాయికుల విశ్వాసము. ఇది పరిమాణమున చిన్నది అయ్యును విషయభరమున పెద్దదియే.

ఇట్టి పాణినీయశిక్షకు ప్రియశిష్యశిరోమణి చిరంజీవి కొల్లూరు అవతారశర్మ తెలుగులో చక్కని వ్యాఖ్యను రచించి నాకానందమును కలిగించెను. "దీనిని నేను పరిశీలించితినని" వేరుగ చెప్పనక్కరలేదు.

ఈకృతిని తెలుగువారికందించుటలో "ఆంధ్రప్రదేశ్ సాహిత్య ఎకాడమీ" వారందించిన ఔదార్యము అభినన్ద్యము.

ఇది ఆంధ్రపండితులనలరింపజేయుగాక అనియు, శ్రీ శర్మ అవిరళమైన కృషిచేసి బహుళగ్రంథకర్త అగుగాక అనియు నాశుభాశంసనము.

అప్పల్ల సోమేశ్వరశర్మ.
9–7–79.

Sahitya Siromani,
Bhashapraveena,
*SURAM SREENIVASULU*, M.A.
(Skt. & Tel.)
Lecturer in Sanskrit.
S.B.S. Sanskrit College.

Ponnuru'
D/ 30-7-76

# ప్ర వే శి క

శ్లో॥ లక్షణేన వినా వాణీ విమలాపి న శోభతే ।
ప్రమదా రూపసంపన్నా దరిద్రస్యేవ యోషితా ॥

ఇది అమోఘమందినీ శిక్షాకారుని వచనం. అందం చందమున్న కాంతైనా దరిద్రుడి దగ్గర శోభించనట్లు, వాక్కు నిర్మలమైనదైనా లక్షణం లేకుంటే రాణించదు. ఒక్క వాక్కే కాదు, ప్రపంచంలో ఏదైనా కొన్ని నియమాలకు కట్టుబడకపోతే పతనానికి చాలా దగ్గరవుతోందని అర్థం. ఆ నియమాలే భాషకు వ్యాకరణ రూపంగాను, వైదిక భాషకు ప్రాతిశాఖ్యలరూపంగానూ, శిక్షాగ్రంథాల రూపంలోనూ ఏర్పడ్డాయి. ప్రవాహరూపమైన భాషకు ఎన్ని నియమాల నేర్పరచినా ఆమార్పు కొద్దో గొప్పో సాగి భాషా విస్తృతికే కారణమవుతుంది. అంతమాత్రాన నియమరహితంగా ఉచ్చారణను వదలివేయటం నేలవిడిచి సాముచేయుటే. కాబట్టి ఆ ఉచ్చారణ సిద్ధాంతాన్ని ప్రధాన విషయంగా ప్రతిపాదింపదలచి ఏర్పడిన గ్రంథాలే శిక్షాగ్రంథాలు.

శిక్ష వేదాంగాలలో ఒకటి. శిక్ష, వ్యాకరణం, ఛందస్సు, నిరుక్తం, జ్యోతిషం, కల్పం - ఈ ఆరును వేదాంగాలుగా ప్రసిద్ధాలు. వీటిలో శిక్ష - వ్యాకరణం - నిరుక్తం మూడును శబ్దశాస్త్రవిచారకాలే. మూడూ మూడు భిన్న కోణాలనుండి భాషను పరిశీలిస్తాయి. శబ్దోచ్చారణకు సంబంధించినవి శిక్షలు. పదనిష్పత్తిని చర్చించునది నిరుక్తం. పదసాధుత్వాన్ని పరామర్శించేది వ్యాకరణం. 'శిక్షా ఘ్రాణం తు వేదస్య' అనే వాక్యం శిక్షలకుగల ప్రాధాన్యాన్ని సూచిస్తోంది. వైదికభాషకు శిక్షనాసికవంటిది. అంతేగాక షడంగాలలో దానిని మొదటపేర్కొనుట దాని ప్రాధాన్యాన్ని, ఆవశ్యకత్వాన్ని సూటిగా చెప్తుంది. శిక్షాశాస్త్రం శాస్త్రీయమే అనేందుకు ఆధారాన్ని; ప్రామాణికమని అంగీకరించేందుకు అవకాశాన్ని ఉపనిషద్గ్రంథాలందజేస్తాయి. ముండకోపనిషత్తు, ఛాందోగ్యోపనిషత్తు, బృహదారణ్యకోపనిషత్తు, తైత్తిరీయోపనిషత్తులు శిక్షా శాస్త్రాన్ని పరామర్శిస్తాయి. శిక్షలను అటనట ప్రస్తావివించటమేగాక స్వరాలకు, వర్ణోచ్చారణకున్న వైశిష్ట్యాన్ని పలుతావులలో కంఠోక్తిగా ప్రకటిస్తాయికూడా.

**శిక్షాపదార్థం:-**

"శిక్ష్యతే=ఉపాదియత్వే వాగుచ్చారణం అనయా ఇతిశిక్షా" అనగా వర్ణోచ్చారణం దీనిచే నివరింపబడుతుంది

కాబట్టి ఇది శిక్ష. "వర్ణస్వరోచ్చారణప్రకారః యత్రో పదిశ్యతే సాశిక్షా" అని ఋగ్వేద భాష్యం పలుకుతోంది. "అస్మిన్ స్థానేఽనేన కరణేన అయం వర్ణః ఉచ్చార్యతే ఇతి యావన్న విజ్ఞాయతే తావదపరాధ్నోతి స్వరతో వర్ణతశ్చ" * అని కళుత్తూరి వీరరాఘవాచార్యులుగారు తత్ప్రయోజనాన్ని ఉగ్గడించినారు. ఏస్థానంలో ఏకరణంతో అక్షరాన్ని ఉచ్చరింపవలెనో తెలియనపుడు స్వరదోషం వర్ణదోషం ఏర్పడుతాయి. అది ప్రమాదాన్ని తెచ్చిపెడుతుంది. "ఇంద్రశత్రుర్వర్ధస్వ" అనే అభిచారమంత్రంలో ఇంద్రశత్రుపదాన్ని తత్పురుష సమాసాన్ని ఆశ్రయించి అన్తోదాత్తంగా పఠించాలి. కాని పొరపాటున ఆద్యుదాత్తంగా ఉచ్చరిస్తే అది బహువ్రీహిసమాసమై అర్థంలో మార్పును తెస్తుంది. స్వరంలోని మార్పువల్ల అర్థంలో మార్పురావటం ఆంధ్రభాషలో సైతం ప్రసిద్ధమే. కాబట్టి స్వరంలోనిమార్పు అనర్థహేతువు. దానిని నియమించేవి శిక్షాగ్రంథాలే. అట్లే వర్ణవిషయంలో సైతం వర్ణోచ్చారణలో అవసరమైన జాగ్రత్తను వివరించేశ్లోకాన్ని గమనించండి

వ్యాఘ్రీ యథా హరేత్పుత్రాం దంష్ట్రాభ్యాం
నచపీడయతే।
భీతాపతన భేదాభ్యాం తద్వద్వర్ణాన్ ప్రయోజయేత్॥ ♦

---

* (పాణినిశిక్షకు) శిక్షావా[illegible]వ్య – పుట 4.

♦ శంభుశిక్ష

ఆడపులి పిల్లలను నోటితో కరచుకొని పరుగెత్తుతుంది. తేలిగ్గా పట్టుకుంటే పడిపోతాయని భయం. గట్టిగా నొక్కిపట్టుకుంటే ముక్కలై చచ్చిపోతాయని భయం. ఈ రెండు భయాలను అధిగమించి అది కార్యసాధన చేస్తుంది. వర్ణోచ్చారణ విషయంలో సైతం అంతే జాగ్రత్త అవసరమట. అమరవాణిలోని వైదికసాహిత్యం స్వరప్రధానం వికస్వర కవితానిధానంకూడా. అపౌరుషేయమైన ఆ సాహిత్యాన్ని సంరక్షించే బాధ్యతను పండితులకన్న స్వరవర్ణాలెక్కువగా స్వీకరించాయి. "వేదస్యాధ్యయనం సర్వం గుర్వధ్యయన పూర్వకమ్" అని అవి కేవలం గురుముఖతః అభ్యసించ వలసిన దే. కనుకనే ఆ వాఙ్మయనిధికి స్వరాల అవసరం అత్యంతం కలిగింది. అందుకే షడంగాలలో శిక్ష ప్రధాన మైంది.

**శిక్షా ప్రతిపాద్యం:**

"శీక్షాం వ్యాఖ్యాస్యామః వర్ణస్స్వరః మాత్రా బలం సామసన్తానః ఇత్యుక్తశ్శీక్షాధ్యాయః" అని తైత్తిరీయోపనిషత్తు శిక్షావిషయాన్ని సంగ్రహంగా వివరించింది అకారాది వర్ణాలు - ఉదాత్తానుదాత్తస్వరితాదిస్వరాలు - హ్రస్వదీర్ఘ ప్లుతాది మాత్రలు, ఆభ్యంతర బాహ్యాదియత్నాదులను వివరించే బలం,వర్ణాన్ని ఎంతకాలముచ్చరించాలో తెలిపే సామం,సంహితారూపమైన సంతానం, ఇవి-శిక్షాప్రతిపాద్య

విషయాలని తైత్తిరీయోపనిషత్తు. అంతేగాక ప్రత్యక్షరానికి దేవతా జాత్యాదులన్నైతం శిక్షాగ్రంథాలు వివరిస్తాయి.

వర్ణసంఖ్యాది విషయంలో శిక్షాగ్రంథాలలో భిన్నాభిప్రాయాలు అనేకాలు కన్పిస్తాయి. మాహేశ్వరసూత్రాల ననుసరించి వర్ణాలు 42* అయితే యాజ్ఞవల్క్యశిక్ష 56; వైదికాభరణసారం 59; త్రిభాష్యరత్నం 60; శంభుశిక్ష మతభేదంచే 63, 64; పాణినిశిక్ష 64; కాత్యాయనశిక్ష 65; వ్యాసశిక్ష 66; శౌనకశిక్ష వ్యాసశిక్షలో వర్ణాలతో ఌకార దీర్ఘాన్ని కలిపి 67; కాలప్రాధాన్యాన్ని అనుసరించిన కొన్ని శిక్షలలో 73; కరణ ప్రాధాన్యాన్ని ఆశ్రయించిన శిక్షలలో 65; స్వరప్రాధాన్యాన్ని స్వీకరించి లక్ష్మీపతిశిక్ష మొ॥ వానిలో 108 వర్ణాలు; ప్రతిపాదింపబడ్డాయి. స్వరములుకూడా ఉదాత్తానుదాత్తస్వరితాలతో బాటుగా విక్రమం, క్షైప్రం నిత్యం, ప్రతిహతం, అభినిహితం, ప్రశ్లిష్టం, పాదవృత్తం, తైరోవ్యంజనం మొ॥ స్వరాలనుకూడా వివరిస్తాయి. ఇట్లే మాత్రాది విషయాలలోను విస్తృత ప్రాతిపదికమీదనే శిక్షాగ్రంథాల్లో చర్చసాగుతుంది.

---

* అఇఉణ్; ఋఌక్, ఏఓఙ్, ఐఔచ్, హయవరట్, లణ్, ఞమఙణనమ్, ఝభఞ్, ఘఢధష్, జబగడదశ్, ఖఫఛఠథచటతవ్, కపయ్, శషసర్, హల్ – ఇవి మాహేశ్వర సూత్రాలు.

## శిక్షాశాస్త్రం ప్రాచీనమా ? ఆధునికమా ?

శిక్షాగ్రంథాలు ప్రాచీనాలు అనగా దాదాపు పాణిని కాలంనుంచీ వున్నవని విమర్శకుల తలంపు.

"The Siksas which as we have them are probably later than Panini, but doubtless existed in his time proving the care taken to secure due correctness of pronounciation of the Scriptures"[1] అని A. B. Keith వక్కాణం. పాణినికి సమకాలీనాలుగానో, అర్వాచీనాలుగానో వున్న ఈ శిక్షాగ్రంథాలు ఉచ్చారణ స్పష్టతను సాధించటమే లక్ష్యంగా పెట్టుకొని కృషిచేశాయి, చేస్తున్నాయికూడా! ఆధునికకాలంలో తులనాత్మకభాషాశాస్త్రంలో Linguisticsలో ధ్వని విచారణ (Phonetics) ఎంతో ప్రధానమైన విషయం. ఉచ్చార్యమాణధ్వనికి లిపికి గల తేడాలను పరిహరించేందుకు International phonetic Alphabet యొక్క ఏర్పాటు వర్ణోచ్చారణకు భాషాశాస్త్రవేత్తలిచ్చిన ప్రాధాన్యాన్ని తెలియజేస్తోంది. నాటి శిక్షాగ్రంథాలు సైతం ఆ విషయంమీదనే కృషిని సాగించాయి. అందుకే శిక్షాగ్రంథాలు ప్రాచీనకాలంలోని భాషాశాస్త్రానికి

---

1. The History of Sanskrit Literature,
A.B. Keith P. 423

నిదర్శనాలు, నేటి భాషాశాస్త్రానికి కొంతవరకు మార్గదర్శ కాలు. అదిభాషాశాస్త్రజ్ఞులుకూడా అంగీకరించిన విషయమే. కనుకనే శిక్షాశాస్త్రమెంత ఆధునికమో అంత ప్రాచీనం-ఎంత ప్రాచీనమో అంత ఆధునికం.

శిక్షాగ్రంథాలు కొన్నికొన్ని ఆయాదేశాలకు పరిమిత మైనవి. మరికొన్ని సర్వసాధారణమైనవి. వ్యాస శిక్షా వ్యాఖ్యానంలో శ్రీ సూర్యనారాయణ సూరావధాని శిక్షల నిలా సంగ్రహించాడు.

> ప్రథమా వ్యాస శిక్షాచ లక్ష్మీ శ్శిక్షా ద్వితీయికా ।
> భారద్వాజీ తృతీయాచ శిక్షారణ్యా తురీయికా ॥
> పంచమీ శంభుశిక్షాచ షష్ఠీ చాపిశలీ తథా ।
> సప్తమీ పాణిని శిక్షా చాష్టమీ కౌహాలీ తథా ॥
> వాసిష్ఠీ నవమీ చైవం నవశిక్షాః ప్రకీర్తితాః ॥

అని నవశిక్షలను పేర్కొనినాడు. ఇవి ప్రసిద్ధమైనవి. ఇవిగాక ఇంకా లక్ష్మీకాంత, కౌండిన్య, వ్యాళ, వ్యాడి, వాల్మీకి, కాలనిర్ణయ, బోధాయన, సర్వసమ్మత, సిద్ధాంత, హారిత, అమోఘనందిని, క్రమకారికా, స్వరాంకుశశిక్ష మొ॥ సాధారణ శిక్షలు; ఋక్శాఖకు సంబంధించిన శైయానశిక్ష: సామశాఖకు చెందిన నారద. గౌతమ, లోమశశిక్షలు; కృష్ణ

యజుశ్శాఖకు సంబంధించి స్వర, ఆత్రేయాదిశిక్షలు; శుక్లయజు శ్శాఖకు సంబంధించి యాజ్ఞవల్క్య, కాత్యాయనాది శిక్షలు; అథర్వవేదానికి సంబంధించి మాండూక, కపిల, కాల అథర్వణపరిశిష్టాదిశిక్షలున్నాయి. అంతేగాక మల్లశర్మ మొ॥ ఆధునికులు రచించిన శిక్షాగ్రంథాలుకూడా కొన్నికన్పిస్తాయి.

షుమారు 86సం॥ క్రిందట శ్రీయుగళకిశోరవ్యాస పండితులు శిక్షా సంగ్రహమను పేరుతో ఒకగ్రంథాన్ని ప్రకటించారు. దానిలో మాధ్యందినశాఖకు సంబంధించిన 25శిక్షలు ఋగ్వేదసంబంధి ఒకటి, నారద, గౌతమ, లోమశులు రచించిన సామశాఖీయశిక్షలు; అథర్వశాఖీయమైన మాండూకశిక్ష; మల్లశర్మ రచించిన శిక్షలు మరికొన్ని శిక్షాగ్రంథవ్యాఖ్యానాలు చోటుచేసుకున్నాయి.

శిక్షాగ్రంథాలవంటివే ప్రాతిశాఖ్యలు సైతం. కొన్ని శిక్షలే ప్రాతిశాఖ్యల పేరుతోవున్నాయికూడా. Phonetic change చక్కగా పరిశీలించి వివరించెడి గ్రంథాలు ప్రాతిశాఖ్యలు. ఋగ్వేదంలోని శాకల శాఖకు సంబంధించి ఒక ప్రాతిశాఖ్యం, కృష్ణశుక్లయజుశ్శాఖలకు చెరియొక ప్రాతిశాఖ్యం, అథర్వవేదానికొక ప్రాతిశాఖ్యం ప్రసిద్ధమైనవి శిక్షా ప్రాతిశాఖ్యల రెండింటి లక్ష్యం స్వర విచారమేమైనా స్వల్పమైన విషయభేదాన్నిబట్టి ఇవి భిన్నరూపాలు ధరించాయి.

శిక్షాశాస్త్రం వ్యాకరణాంతర్భూతమని కొందరి వ్యవహారం. కాని అదిసరికాదు. వ్యాకరణం స్వసామగ్ర్యసిద్ధికై శిక్షా శాస్త్రాన్ని కొంత అపేక్షించినట్లు శిక్షలు పాక్షికంగా వ్యాకరణాంశాలను అపేక్షిస్తాయి. అంతమాత్రాన శిక్షావ్యాకరణ ప్రాతిశాఖ్యలొకటికావు. పృథగ్విషయాలే.

## పాణిని శిక్ష

ఉపలభ్యమాన శిక్షాగ్రంథాల్లో పాణినిశిక్ష ప్రధానం, బహుళప్రచారం పొందిందికూడా. విశ్వాన్నంతటిని దిగ్భ్రాంతిలో ముంచిన అష్టాధ్యాయిని రచించిన పాణిని లేఖిని తదుచ్చారణాత్మకమైన శిక్షాగ్రంథాన్నిసైతం సంతరించింది.

అథశిక్షాం ప్రవక్ష్యామి పాణినీయం మతం యథా।
శాస్త్రానుపూర్వం తద్విద్యాద్యథోక్తం లోకవేదయోః॥

అని పాణిని తనశిక్షనారంభించాడు. శిక్ష వేదాంగమనే ప్రసిద్ధమైనా, లోకవేదానుసారిత్వాన్ని ప్రకటించి శిక్షలకు లౌకిక భాషాంగత్వాన్నికూడా అంగీకరిస్తూ పాణిని గ్రంథరచనకుపక్రమించాడు. వేదాంగమైనంతమాత్రాన లోకవిరుద్ధం కానవసరంలేదని లోకాంగంసైతం కావచ్చుననితద్భాష్యకర్తల సమర్థన. పాణిని వ్యాకరణం లౌకికమైనా ఛందః ప్రయోగాలనుకూడా పాణిని తన సూత్రాలలో నిబంధించాడుగదా! అట్లే వైదిక శిక్షలలో, లోకానిక్కూడా ప్రాధాన్యాన్నిచ్చి భాషాశాస్త్రులకు మరింత దగ్గరైనాడు.

ఈ పాణిని శిక్షకు శ్రీమాన్ కళత్తూరి రాఘవాచార్యులుచే భారద్వాజరాఘవీయమనే పేరుతో సంస్కృత భాషలో భాష్యం వ్రాయబడి 1893 లో ముద్రింపబడివుంది, ఇది విషయ విమర్శయందును, శైలీవిన్యాసాదులలోను పతంజలి భాష్యాన్ని పోలివుండి కౌముదికి మహాభాష్యమెట్లో, పాణిని శిక్షకు అట్టిభాష్యరూపంగా కన్పిస్తోంది. పండితుల మన్ననలను పొందిందికూడా. అదివిస్తృతమైనది, గీర్వాణ వాణిలోనిదికూడా.

ఆ పాణిని శిక్షను ఆంధ్రభాషలో - సంక్షిప్త వ్యాఖ్యానంతో పరిచయంచేయాలని సంకల్పించిన శ్రీ కొల్లూరు అవతారశర్మగారు అభినందనీయులు. అదిఆంధ్రభాషావ్యాఖ్యానంతో వెలువడుట కేవలం సంస్కృతాధ్యేతలనేకాక, భాషాశాస్త్రాధ్యేతలకును ముదావహమైన విషయమే. పాఠకలోక మీగ్రంథాన్ని సాదరంగా స్వీకరింపగలదని వ్యాఖ్యాతకొక మిత్రుడుగా నేనాశించుచున్నాను.

పొన్నూరు
30-7-79.

భవదీయుడు
సూరం శ్రీనివాసులు

# విషయసూచిక

| విషయము | పుట |
|---|---|


---

శ్రీ మత్పర దేవతాయైనమః

# ఆ ము ఖ ము

మానవుడు నిరన్తరసుఖాభిలాషి. ఆతఁడెల్లప్పుడును-'సుఖంమే భూయాత్ దుఃఖం మాభూత్' అనగా -'సుఖమే నాకు కలుగవలె; దుఃఖము వలదు' - అనితలపోయును. మానవుని యీ సుఖజిజ్ఞాసా ఫలితమే విజ్ఞానశాస్త్రము. లౌకికసుఖములను నశ్వరములని యెఱింగిన వారగుటచే మన మహర్షులు శాశ్వతములగు పారలౌకికసుఖముల నతయఁగోఱి తమ తపఃప్రభావము చే తత్సుఖప్రదములగు మంత్రములను దర్శించిరి. ఆమంత్రసముచ్చయమే వేదమని మన సంప్రదాయము. వేదార్థ-పరిజ్ఞానమువలన మనుష్యుడు శాశ్వత సుఖములనుఁ బడయగలడు; మరియు నిహలోకమునగూడ పూజ్యుడు కాఁగలడని యాస్కాచార్యులుప్రవచించిరి.

> "యోఽర్థజ్ఞ ఇత్సకలం భద్రమశ్నుతే
> నాకమేతి జ్ఞానవిధూతపాప్మా."
>
> (నిరుక్తము - ప్రథమాధ్యాయము)

ఎవఁడు వేదార్థమునుఁ దెలిసికొనునో, యాతఁడు సర్వ శుభములఁ బడయఁగలఁడనియు, తుదకు జ్ఞానము చే కడిగివే

యఁబడిన పాపములు గలవాఁడై స్వర్గమునుఁ బొందుననియు భావము.

ఈ విధమగు శాశ్వతసుఖమే మోక్షమనియు, నది బ్రహ్మజ్ఞానమువలన గలుగుననియు మన ప్రాచీనాచార్యులు వచించిరి. బ్రహ్మపదమునకు వేదమర్థము. వేదార్థజ్ఞానము సంపూర్ణముగ కలుగవలెనన్నచో తత్తత్సంహితా పాఠములు, విభాగములు, స్వరపరిజ్ఞానము, స్వాధీనములై యుండవలెను. వేదము స్వరప్రధానము. స్వరమర్థనిర్దేశకము. మరియు య్యది వ్యాకరణాధీనము. కావుననే తొలుదొలుత వేదశాఖలలో నొక్కొక్క శాఖకొక్కొక్క వ్యాకరణగ్రంథము చొప్పున రచింపఁబడినవి. ప్రతిశాఖకు నేర్పడినవగుటఁజేసి యీ వైదికవ్యాకరణగ్రంథములకు ప్రాతిశాఖ్యములని పేరువచ్చెను. ఋగ్వేదీయప్రాతిశాఖ్యము శౌనకవిరచితము. శుక్లయజుర్వేదీయ - మధ్యందినశాఖాసంబంధిప్రాతిశాఖ్యము వాజసనేయీ - ప్రాతిశాఖ్య(సూత్ర)ముగాఁ బ్రసిద్ధిని బడసినది దీనిని కాత్యాయనుఁడు రచించెను. కృష్ణయజుర్వేదప్రాతిశాఖ్యము తైత్తిరీయప్రాతిశాఖ్యమను పేర ప్రసిద్ధినిబొందినది. సామవేదమునకు మూఁడు విధములైన ప్రాతిశాఖ్యములున్నట్లు తెలియును. అథర్వవేదప్రాతిశాఖ్యము చాతురధ్యాయికమను పేర వ్యవహరింపఁబడుచున్నది. రాను రాను

యీ ప్రాతిశాఖ్యములు సుసంస్కృతములై వానికి సంబంధించిన శిక్షాప్రణయనమునకు మార్గదర్శకములైనవి.

**శిక్షా గ్రంథముల యావశ్యకత:-** వేదముచ్చారణ ప్రధానమైనది. ఆయుచ్చారణము స్వరాధీనమై యున్నది. స్వరమును దుష్టముగా నుచ్చరించినచో నది ప్రయోక్త పాలిట పిడుగు పాటగును. (చూ. శ్లో. 52) మరియు వేదాధ్యయనశీలుండగు వాడు గురులఘు విభాగములను, హ్రస్వదీర్ఘప్లుతస్వరూపములను, లోపాగమాది వర్ణవికారములను, ప్రకృతివికృతుల క్రమములను స్వరితోదాత్తానుదాత్తాది స్వరవిశేషములను, బాహ్యాభ్యన్తరాది ప్రయత్నజాలమును, సమగ్రముగాం దెలిసియుండవలెనని మన సంప్రదాయము చాటుచున్నది.

శ్లో॥ గురుత్వం లఘుతా సామ్యం-హ్రస్వదీర్ఘప్లుతాని చ
లోపాగమవికారాశ్చ - ప్రకృతిర్వికృతిక్రమః
స్వరితోదాత్తనీచత్వం శ్వాసోనాదస్తథోభయమ్
ఏతత్సర్వం చ విజ్ఞేయం ఛందోభాషా మధీయతా॥

వేదార్థజిజ్ఞాసువుచే అనగా - వైదికభాష నభ్యసింపం దలచిన వానిచే వైదిక శబ్దములందలి వర్ణముల గురుత్వ లఘుత్వములు, హ్రస్వదీర్ఘ ప్లుతాది స్వరతత్త్వము, లోపాగ

మాది (వర్ణ) వికారములు, ఉదాత్తానుదాత్త స్వరితత్వములు, ప్రకృతివికృతిక్రమము, శ్వాసనాదస్వభావము - అనగా ప్రత్యక్షరము సమగ్రముగా నధ్యయనము గావింపవలసి యున్నది. ఈ విషయమంతయు శిక్షాగ్రంథములందు సవిస్తరముగా, సోదాహరణముగా వివరింపఁబడి యున్నది. కావుననే యవి ప్రథమవేదాంగముగా సంప్రదాయజ్ఞులగు పండితులచే పరిగణింపబడినవి*. స్వరవిజ్ఞానమును సోపపత్తికముగా, వైజ్ఞానికముగా, ప్రతిపాదించిన యీ శిక్షాగ్రంథములు ప్రస్తుతభాషా శాస్త్రము (Science of language) నకు, అందును, తద్గత ధ్వని నిరూపణవిభాగము (Phonetics) నకు నాందీరూపములని చెప్పవచ్చును.

**శిక్షా స్వరూపము :-** 'శిక్ష-విద్యోపాదానే' యను ధాతువునుండి శిక్షాశబ్దము నిష్పన్నము. శిష్యుని శిక్షించునది (అనగా వర్ణాద్యుచ్చారణమును యథావిధిగా గరపునదని భావము.) శిక్షయనఁబడును. ప్రసిద్ధమైన యీ శిక్షా శబ్దము ఉపనిషత్తులయందు 'బాగుగ తెలియుటకు సాధనము అను నర్థమున వాడినట్లు చూపట్టును. అచట శిక్షాస్వరూప మిట్లని వివరింపఁ బడినది—

---

*శ్లో॥ శిక్షా వ్యాకరణం ఛందః నిరుక్తం జ్యోతిషం తథా
కల్పశ్చేతి షడంగాని వేదస్యాహుర్మనీషిణః ॥

"అథ శీక్షాం వ్యాఖ్యాస్యామః। వర్ణః స్వరః। మాత్రా బలమ్। సామ సన్తానః। ఇత్యుక్తః శీక్షాధ్యాయః ॥"

(తైత్తిరీయోపనిషత్తు-శీక్షాధ్యాయము)

ఇచట శ్రీశంకరులు - 'శిక్ష్యతేఽనయేతి వర్ణాద్యుచ్చారణమ్-శిక్షా' - అనియు, 'శిక్ష్యన్త ఇతి వర్ణాదయః శిక్షా' - అనియు శీక్షా శబ్దమునకు నిర్వచనములను జెప్పిరి. శిక్షా - శీక్షా శబ్దముల యభేదమునుఁగూడ నాచార్యులు - "దైర్ఘ్యం ఛాన్దసమ్" (శీక్షా - అనుపదమున ఈకారము వైదిక ప్రయోగమని భావము) అని స్పష్టముగా ప్రతిపాదించిరి.

ఇచట వర్ణమన - అకారాది వర్ణసమామ్నాయముగను, స్వరమన నుదాత్తాది స్వరసముదాయముగను, మాత్రయన హ్రస్వదీర్ఘప్లుతాది కాలపరిమాణముగను; బలమన - బాహ్యాభ్యన్తర ప్రయత్నజాతముగను; సామ యనగా వర్ణముల సమతోచ్చారణముగను; సన్తానమన సన్నికర్షరూపమగు సంహితగను; నాచార్యులచే వ్యాఖ్యానింపఁ బడినది.

తత్ర వర్ణోఽకారాదిః। స్వర ఉదాత్తాదిః। మాత్రా హ్రస్వాద్యాః। బలః ప్రయత్నవిశేషః। సామ - వర్ణానాం మధ్యమ

వృత్త్యోచ్చారణం సమతా। సన్తానః-సన్తతిః-సంహితేత్యర్థః।
ఇతి (చూ. తై। ఉప॥ అను౨. శాం. భా)

ఈ సంప్రదాయము ననుసరించియే శిక్షాగ్రంథములు వెలువడినవి. పై యంశములన్నియు సామాన్యముగ నన్ని శిక్షాగ్రంథములందును చూపట్టును. శిక్షాగ్రంథములలో నెల్ల 'పాణినీయశిక్ష' యను ప్రకృతగ్రంథము తలమానిక మనఁదగినది. అయ్యది జగత్ప్రసిద్ధ వ్యాకరణసంప్రదాయప్రవక్త యగు పాణినిముని ప్రణీతముగాఁ జెప్పబడుచున్నది. ఇది గాకనారదీయశిక్ష, వ్యాసశిక్ష, యాజ్ఞవల్క్యశిక్ష, లోమశశిక్ష మొదలగు తత్తన్ముని ప్రణీతములగు శిక్షాగ్రంథము లనేకములున్నవి.

వీనిలో నీగ్రంథము "అల్పాచ మాత్రా బహుళ్లో గుణాళ్చ" - (పరిమాణమున చిన్నది గుణమున గొప్పది) యన్నట్లు - అర్థగాంభీర్యము గలదై పరిమాణమున చిన్నదయ్యు నేకాదశఖండాత్మకమై (చూ॥ శ్లో 61) మహావిశేష ప్రకటనసమర్థమై యలరారుచు నేటికి ననేక భాషాశాస్త్ర జిజ్ఞాసువులకు అందును, ధ్వన్యుచ్చారణవిషయపరిశోధకులకు మిక్కిలి యుపకరించుచున్నది.

ధ్వన్యుచ్చారణక్రమ మిందు వైజ్ఞానికముగాఁ జర్చింపఁబడినది. అత్యంత సులభశైలిలో వర్ణసంఖ్యావిచారము, స్వర వర్ణ విభాగములు, అష్టవిధ విసర్గవిపరిణామములు, అయోగ వాహముల స్థాననిర్ణయము, రంగవర్ణోచ్చారణము, స్థాన ప్రయత్నవివేకము మొదలగు ముఖ్యాంశములిందు సోపపత్తికముగ ప్రదర్శితములు. వానిని పాణినీయసంప్రదాయమునకు భిన్నముకాని రీతిని సవిమర్శముగ తెలుఁగునఁదెల్లముజేసి వెల్లడింప నుద్యమించినాడను. గ్రంథపరిష్కారముననిది నా ప్రథమ కృతియగుటఁజేసి సహృదయులగు విజ్ఞులు దీని నాదరించి, సవరణలున్నచోఁ దెల్పి నన్నుఁ గృతార్థునిఁ జేయఁ బ్రార్థించుచున్నాను.

ఇట్లు

రామచంద్రపురం.
తేదీ 3—8—77.

విబుధ విధేయుఁడు,
అవతారశర్మ.

ఓమ్ శ్రీమత్పర దేవతాయైనమః

# పాణినీయ శిక్షా

## (పాణినీయ శిక్ష)

**అవతారిక :-** దుఃఖత్రయము (ఆధ్యాత్మికము, ఆధిదైవికము, ఆధిభౌతికము.), బ్రహ్మజ్ఞానమును పొందుటచే దూరమగును. ఆబ్రహ్మజ్ఞానము వేదార్థపరిజ్ఞానాధీనము. అది స్వరాధీనము. ఈ తత్త్వము నెఱింగిన మహర్షులు కొందరొకపరి బ్రహ్మజ్ఞానజిజ్ఞాసువులై తపోనిష్ఠాగరిష్ఠుఁడును, మహేశ్వరప్రసాదలబ్ధశబ్దవిద్యాసంప్రదాయప్రవర్తకుఁడును నగు పాణిని మహర్షిని స్వరపరిజ్ఞానమును గరుప ప్రార్థించిరి. అంతట పరమకారుణికుఁడగు నామహర్షి బ్రహ్మజ్ఞానమునకు మూలకారణమగు వేదార్థపరిజ్ఞానము శిక్షాధ్యయనైకసాధ్యమని నెమ్మది నూహించి శిక్షాగ్రంథమును స్వమతానుసారముగా ప్రతిపాదింపనుద్యమించి, యద్దానినారంభించుచున్నాడు:

శ్లో॥ అథ శిక్షాం ప్రవక్ష్యామి పాణినీయం మతం యథా।
శాస్త్రానుపూర్వం తద్విద్యాద్యథోక్తం లోకవేదయోః॥1

**అర్థము :-** (అథ–శిష్యప్రశ్నానన్తరము; పాణినీయం మతం యథా = పాణినీయమగు (నా) మతానుసారముగా;

శిక్షామ్-శిక్షయనఁబడు ప్రథమవేదాఙ్గమును*; ప్రవక్ష్యామి - విశేషముగా వచింతును; తద్-ఆయది (నా శిక్షాప్రణయన పద్ధతి) లోకవేదయోః - లౌకిక వైదిక సంప్రదాయములందు; యథోక్తమ్=చెప్పబడినట్లును; శాస్త్రానుపూర్వమ్ = శాస్త్రమునసనుసరించి యాచార్యులచే పరంపరితముగా ప్రవర్తింప జేయబడుచున్న యానుపూర్వికలదిగను, విద్యాత్ - తెలియవలెను.

వ్యాఖ్య:- గ్రంథాదియందు స్వీయగ్రంథముయొక్క నిర్విఘ్నపరిసమాప్త్యర్థమై మఙ్గళమాచరించుట మన సంప్రదాయము. కాని యార్షమగు నీగ్రంథమునందట్టి మఙ్గళాచరణము గావింపఁబడలేదు. అంతమాత్రమున మహర్షి సంప్రదాయము నుపేక్షించెనని పలుకుట పాడిగాదు. మఙ్గళకరమగు 'అథ' శబ్దముతో కృతులనారంభించు నాచారముగూడ మన శాస్త్రములందు చూపట్టును. పూర్వమీమాంసాశాస్త్రప్రవర్తకుఁడగు జైమినిమహర్షి - 'అథాతోధర్మజిజ్ఞాసా' యని ప్రారంభించి తన 'ద్వాదశలక్షణిని' వెలయించెను.

'అథ'శబ్దము మాఙ్గళికమని శ్రీశంకరులు సెలవిచ్చియున్నారు. 'అర్థాన్తరప్రయుక్త ఏవ హ్యథశబ్దః శ్రుత్యా

---

* శిక్షావ్యాకరణం ఛన్దః నిరుక్తం జ్యోతిషం తథా ।
కల్పశ్చేతిషడఙ్గాని వేదస్యాహుర్మనీషిణః॥
అను మనసంప్రదాయమునననుసరించి యనిభావము.

మఙ్గళప్రయోజనో భవతి'- యని శాఙ్కరభాష్యము. స్మృతు లందు గూడ-

శ్లో॥ ఓంకారశ్చాథశబ్దశ్చ ద్వావేతౌ బ్రహ్మణః పురా ।
కంఠం భిత్త్వా వినిర్యాతౌ తస్మాన్మాఙ్గళికావుభౌ॥ - అని

వచింపఁబడియున్నది. కాన, మహర్షి 'అథ'శబ్దముతో గ్రంథా రంభము గావించుటచే సంప్రదాయమును విడువలేదని వ్యక్త మగుచున్నది.

పాణినీయమతానుసారముగా వచించెదనని చెప్పుకొనుటలో నాతనికి తనశాస్త్రముపైగల విశ్వాసము, మరియు నాతని శాస్త్రప్రౌఢిమాప్రామాణ్యములు వ్యక్తములగు చున్నవి. ఇంకను కవి "శాస్త్రానుపూర్వ్య"మని వచించి తన గ్రంథపు ప్రామాణ్యమును స్థిరపరచుచున్నాడు.

ఇతరశిక్షాగ్రంథములానాటికే ప్రాచుర్యము వహించి యుండగా తన యీ నూతనగ్రంథప్రణయన మెందులకను ప్రశ్న యుదయింపకపూర్వమే తత్పరిహారార్థమై - 'యథోక్తం లోక వేదయోః' అని, చెప్పుకొనినాడు. అనగా నితరశిక్షాగ్రంథములు కేవలవైదికములు కాగా తన యీశిక్షాప్రణయనపద్ధతి వానికన్న విలక్షణమై, లౌకిక వైదికసంప్రదాయములు రెంటికిని సంబంధించినదని యాతనిహృదయము. లౌకికవైదికభాషలకు పాణినీయశాస్త్రావశ్యకత యిట్టిదని చెప్పబనిలేదు. వ్యాకరణ

మహాభాష్యకర్త యగు పతఞ్జలిమహర్షి - "రక్షోహాగమల ఘ్వసందేహాః ప్రయోజనమ్ ... రక్షార్థం వేదానామధ్యేయం వ్యాకరణమ్" - వేదసంరక్షణము, అర్థసంశయము లేకపోవుట లాఘవము మొదలైనవి వ్యాకరణ ప్రయోజనములు..... వేదసంరక్షణమునకై వ్యాకరణమును చదువవలెను. అని వ్యాకరణశాస్త్ర ప్రయోజనములను తెల్పియున్నాఁడు. 'కాణాదం పాణినీయంచ సర్వశాస్త్రోపకారకమ్'. న్యాయవ్యాకరణములు రెండును అన్నిశాస్త్రములకు నుపకరించును. అనునభియుక్తోక్తి మనమందర మెఱిఁగినదే. తత్త్వజ్ఞులకీవిషయము అనుభవవేద్యము.

## ఉపక్రమము

అవ:- పాణిన్యాచార్యుఁడు గ్రంథాదిని ముఖ్యప్రతిపాద్యవిషయమగు నుచ్చారణవిధ్యుపదేశావశ్యకతను తెలుపుచూ, వాగుచ్చారణవిధి నుపదేశింప నుపక్రమించుచున్నాఁడు:

శ్లో॥ ప్రసిద్ధమపి శబ్దార్థ మవిజ్ఞాత మబుద్ధిభిః।
పునర్వ్యక్తీకరిష్యామి వాచ ఉచ్చారణే విధిమ్॥ 2

అర్థ:- శబ్దార్థమ్=ఉత్పత్తి, స్థాన, ప్రకారాత్మకమగు శబ్దప్రయోజనజాతము; ప్రసిద్ధమపి - స్వభావతః ప్రసిద్ధమే యైనప్పటికినీ; అబుద్ధిభిః - అల్పబుద్ధికలవారిచే; అవిజ్ఞాతమ్ - (ఇంకను) తెలియబడలేదు. (అట్టివారినుద్దేశించి), వాచః - వాక్కుయొక్క, ఉచ్చారణే - పలుకుబడియందు; విధిమ్ -

(స్థానప్రయత్నాది) ప్రకారమును; పునః - మరల; వ్యక్తీకరిష్యామి - తెలియఁజెప్పుదును.

వ్యా:- ఇచట 'అవిజ్ఞాతమ్, అబుద్ధిభిః' అనుపదములు గమనింపదగినవి. అబుద్ధులు అనగా బుద్ధిహీనులు. అట్టివారి కొరకు మరల తాను చెప్పదొరకొనినట్లు చెప్పుకొనినాఁడాచార్యుడు. బుద్ధిహీనులకు సైతమర్థమగునటుల గహనములగు శాస్త్రీయవిషయములనుఁ బ్రస్తావింపగలనను యాచార్యుని విశ్వాసము, కారుణ్యమును దీన వ్యక్తములగు చున్నవి.

ఈ శిక్షాప్రణయనావసరమున నాచార్యునకాదియందే పూర్వపక్షమెదురైనది. శిక్షాప్రణయనమునకుఁ బూర్వమే భాషారూపమున వర్ణోచ్చారణము వ్యవహారమున నుండినది. ఇంచుక సూక్ష్మదృష్టికతో దర్శించిన వర్ణముల యుచ్చారణ స్థానములు, నుచ్చారణపద్ధతులును మనకవగతములు కాగలవు. కావున వానినిఁ దెలుపుటకు గ్రంథప్రణయన మెందులకని పూర్వపక్షము. ప్రస్తుతము, స్వరవిచారాదికము జిజ్ఞాసావిషయమై యున్నది. అది ప్రసిద్ధమేయైనచో జిజ్ఞాసయే యనవసరము. అప్రసిద్ధమేయగుచో జిజ్ఞాసోదయమే జరుగదు. కావున - 'ప్రసిద్ధం నజిజ్ఞాసితవ్యమ్ - అథాఽప్రసిద్ధం నైవ శక్యం జిజ్ఞాసితుమ్' - అని శంకరులానతిచ్చినట్లీవిషయమున జిజ్ఞాసావిరహము (తెలియగోరిక లేకుండుట) చూపట్టుటఁజేసి, గ్రంథప్రణయనము వ్యర్థమని పూర్వపక్షపిండితార్థము.

దీనికి సమాధానము పై రెండు శ్లోకములందలి - 'శాస్త్రానుపూర్వ్యమ్' 'లోకవేదయోః', 'అవిజ్ఞాతమబుద్ధిభిః' 'పునర్వ్యక్తీకరిష్యామి' - అనుపదములలో గాన్పించును. అనుమేయమగు నుచ్చారణస్థాననిర్ణయములో శాస్త్రప్రామాణ్య మెంతయు నావశ్యకమై యున్నది తదర్థము, శిష్యబుద్ధి వైశద్యార్థము, విషయమును దృఢపరచుటకును; ప్రామాణికరీతినుచ్చారణవిధిని ప్రస్తావింపవలెనని యాచార్యుల సిద్ధాన్తము. అందులకై శిక్షాప్రణయన మత్యంతావశ్యకమని సమాధానము. పై రీతిని పదములతిగంభీరములై యాచార్యుని హృదయమును వ్యక్తము చేయును.

## వర్ణసంఖ్యావిచారము :

అర్థ :- వర్ణస్వరప్రభేదములను ప్రవచించుటకు ముందు వర్ణముల సంఖ్యాపరిగణనము గావించుట యుక్తమని దలంచి యాచార్యుడద్దానినిట్లు ప్రస్తావించుచున్నాడు.

శ్లో॥ త్రిషష్టి శ్చతుష్షష్టిర్వా వర్ణాః శంభుమతే మతాః।
ప్రాకృతే సంస్కృతే చాపి స్వయం ప్రోక్తాః స్వయంభువా॥3

అర్థ :- ప్రాకృతే-ప్రాకృతభాషయందును; సంస్కృతే చాఽపి - సంస్కృతభాషయందును; స్వయంభువా - మహేశ్వరునిచే (బ్రహ్మగారిచేనని వ్యాఖ్యాన్తరములున్నవి); స్వయమ్-స్వయముగా; వర్ణాః-వర్ణములు; ప్రోక్తాః-చెప్పబడి

నవి. శంభుమతే- మాహేశ్వరసంప్రదాయమునందు; త్రిషష్టిః- అరువదిమూడు; వా- లేదా; చతుష్షష్టిః - అరువదినాలుగు; మతాః - యిష్టమైనవి.

వ్యా:- వ్యాకరణాచార్యులు శ్రీరుద్రదత్తశర్మగారీస్థలమున ప్రాకృతపదమునకు 'ప్రాకృతమునకుమూలమైన సంస్కృతము' అనులాక్షణికార్థము నాశ్రయించి దీనిని వ్యాఖ్యానించిరి. అందౌచిత్యమంతగా చూపట్టదు. వారివిషయమున - 'అనేన సంస్కృతమేవ మాతృభాషాభూతం వ్యాపకం పూర్వమాసీదితి సూచితమ్ - ప్రాకృతాదిభాషాణాం సంస్కృతాదేవోత్పత్తిరితిచ ప్రకటీకృతమ్' అని స్వారస్యమునుఁ దెలిపియుండిరి. ఇంతియగాక యీగాని, దీన నాయర్థము స్ఫురింపకున్నది. లక్షణాయుపపత్తి భాషాశాస్త్రసంప్రదాయవిరుద్ధమైనది. లక్షణావృత్త్యాశ్రయణము గూడ నిచట నుచితముగాఁ జూపట్టదు. ముఖ్యార్థమునకు బాధలేకుండుటచే * నిచ్చట అప్రధానవృత్త్యాశ్రయణ మనవసరమని తేలుచున్నది. మరియు నిచట ప్రకరణమునుబట్టి 'స్వయమ్భూ' శబ్దమునకు మహేశ్వరపరముగా నర్థము జెప్పుకొనుట యుక్తముగాఁ దోచును. కాఁగా, నిందలి యుక్తాయుక్తతలను తత్త్వజ్ఞులు, సహృదయులునగు

* ముఖ్యార్థబాధే తద్యోగే రూఢితోఽథ ప్రయోజనాత్ ।
అన్యోఽర్థో లక్ష్యతే యత్సా లక్షణాఽరోపితా క్రియా॥
(కా. ప్ర. 2/9)
(ముఖ్యార్థబాధ లక్షణకు ప్రధానబీజము.)

పాఠకమహాశయులే యోచింతురుగాక!

అవ:- పై శ్లోకమును పఠించిన వెనువెంటనే పాఠక హృదయములందు – 'ఆవర్ణములేవి? అవి యరువదిమూడు నరువదినాలుగు నెట్లయిన' వను నాకాంక్ష యుదయించును. ఇట్టి శంకను తొలగించుటకై యాచార్యుడు శ్లోకద్వయము నుపపాదించుచున్నాడు–

శ్లో॥ స్వరా వింశతిరేకశ్చ స్పర్శానాం పఞ్చవింశతిః।
యాదయశ్చ స్మృతా హ్యష్టౌ చత్వారశ్చ యమాః స్మృతాః॥ 4

శ్లో॥ అనుస్వారో విసర్గశ్చ ≍క ≍పౌ చాపి పరాశ్రితౌ
దుఃస్పృష్టశ్చేతి విజ్ఞేయో ఌకారః ప్లుత ఏవ చ॥ 5

అర్థ:- స్వరాః–అచ్చులు; వింశతిః+ఏకశ్చ – ఇరువదియొక్కటియును; స్పర్శానాం – స్పర్శవర్ణములయొక్క; పఞ్చవింశతిః – ఇరువదియైదును; యాదయః – యకారాదులు; అష్టౌచ – ఎనిమిదియును; యమాః – వర్గప్రథమాక్షరముల నాల్గింటికి పంచమవర్ణము పరమగునపు డారెంటినడుమ నాగమముగా వచ్చు పూర్వసదృశ వర్ణములు * (ఇవి ప్రాతిశాఖ్యములందుఁ బ్రసిద్ధములు); చత్వారశ్చ – నాలుఁగు గను, స్మృతాః – చెప్పఁబడినవి. ఇవిగాక–

---

* వర్గేష్వాద్యానాం చతుర్ణాం పఞ్చమే పరే మధ్యే యమో నామ పూర్వసదృశోవర్ణః ప్రాతిశాఖ్యప్రసిద్ధః. ఉదా:– పలిక్క్నీః చఖ్ఖ్నతుః మొ॥వి (సిద్ధాన్తకౌముది)

అనుస్వారః — బిందువు; విసర్గః — విసర్గము; పరాశ్రితౌ పరవర్ణమునాశ్రయించి యుచ్చరింపఁబడు; ᳵక ᳶపౌ=జిహ్వా మూలీయోపధ్మానీయములు; దుఃస్పృష్టః — రెండచ్చులమధ్య నుండులకారము; ప్లుతః— ప్లుతమగు; ఌకారఏవచ— ఌకారమును, (వెరసి వీనియొక్క— అరువదిమూఁడరువదినాలుఁగులగుటను); విజ్ఞేయః — తెలియఁదగినది.

వ్యా:— పైఁజెప్పబడిన వానిలో ప్లుత ఌకారము (ఌ—౩) ను గూడ గ్రహించిన యరువదినాలుఁగు వర్ణములగును. అద్దానిని గ్రహింపకున్న నరువదిమూఁడే యగును. అదెట్లన — 'అ—ఇ—ఉ—ఋ'—లను నీ నాలుగును ప్రత్యేకముగా హ్రస్వ దీర్ఘప్లుతభేదముచే పండ్రెండును, ఏ—ఓ—ఐ—ఔలు దీర్ఘప్లుతభేద ముచేనెనిమిది (ఏలన వానిలో హ్రస్వప్రభేదము లేదు.) యును, హ్రస్వఌకారమును, వెరసి (12+8+1=21) యిరువది యొక్క అచ్చులును; కకారాది మకారాన్తములగుస్పర్శ వర్ణము ♦ లిరువదియైదును (25); య—ర—ల—వ—శ—ష—స—హ యను యకారాది వర్ణము లెనిమిదియు (8); ఉక్తలక్షణ లక్షితములగు యమాఖ్యవర్ణములు నాలుగును (4); అను స్వార — విసర్గ — జిహ్వామూలీయోపధ్మానీయ — దుఃస్పృష్టము లయిదును (5); వెరసి—(21+25+8+4+5=63) అరువది మూఁడు వర్ణములు తేలినవి. ప్లుతమగు ఌకారమునుఁగూడ గణించినచో నా మొత్తమరువదినాలుఁగునకు హెచ్చును.

---

♦ కాదయోమావసానాఃస్పర్శాః (సిద్ధాన్తకౌముది)

శ్లోకమున 'దుఃస్పృష్టః' అనియుండుటకు బదులు 'ద్విస్పృష్టః' యను పాఠాన్తరము కూడ వ్యవహారమున నున్నది. ఈపాఠము దీక్షితాదులచే నంగీకరింపఁ బడలేదు. కౌముద్యనుసారముగా శేఖరమున - 'ఏకోదుఃస్పృష్ట' అని చెప్పఁబడినది. రాఘవేంద్రాచార్యులచే గూడ నీపాఠమే సమ్మతింపఁబడినది. పైగా ద్విఃస్పృష్టత యను నర్థమిచ్చుట ప్రసఙ్గమున కనుకూలముగాఁ జూపట్టకున్నది. ఏలన వర్ణదీపిక యందు - స్వరమధ్యగత ధకార ధకారములకే ద్విస్పృష్టత చెప్పఁబడినది. ‡ కాని, ప్రకృతమున దుఃస్పృష్టశబ్దమునకు రెండచ్చుల మధ్యనుండు లకారమని యర్థము. కావున 'దుఃస్పృష్టః'- యను పాఠమే యిచట శాస్త్రసమ్మతమని యెఱుఁగునది.

## వర్ణోచ్చారణక్రమము:

అవ:- పై విధముగా వర్ణముల పరిగణనానన్తర మాచార్యునిచే వర్ణోత్పత్తి ప్రకారము నిరూపింపఁబడు చున్నది. ఇది మిగుల వైజ్ఞానికమైనదిగ నీనాటికిఁ బ్రశంసింపఁ బడుచున్నది. దాని నొక్కింత పరిశీలింతము-

శ్లో॥ ఆత్మా బుద్ధ్యా సమేత్యార్థాన్ మనోయుఙ్క్తే వివక్షయా।
మనః కాయాగ్నిమాహన్తి స ప్రేరయతి మారుతమ్॥ 6

‡ ద్విస్పృష్టతా చ విజ్ఞేయా ధధయో స్స్వరమధ్యయోః - (వర్ణదీపిక).

అర్థ:- ఆత్మా- అస్త్ర్యగకరణము, (తన సంస్కారజన్య జ్ఞానము చే); అర్థాన్ -పదార్థములను ( ఘటపటాదులను ); బుధ్వా - (తెనయందలి) జ్ఞానము చే ‡; సమేత్య - ఏకబుద్ధి విషయములుగా మేళవించి; వివక్షయా-తనయందు సంస్కార రూపమున నుండినదానిని ప్రకటించుకోర్కెచే, మనః- (తన సూక్ష్మరూపమగు) మనస్సును; యుక్తే-నియోగించును. మనః-(ఈవిధముగా నియుక్తమగు) మనస్సు; కాయాగ్నిమ్- జఠరాగ్నిని; ఆహన్తి - ఉద్దీపించును; సః- ఆ జఠరాగ్ని; మారుతమ్-వాయువును; ప్రేరయతి-ప్రేరేపించును.

వ్యా:- ఇచట నాత్మన్ శబ్దమునకు 'జ్ఞానాధికరణ మాత్మా' యను తార్కికోక్త లక్షణము ననుసరించి జ్ఞానాధి కరణమని యర్థముఁ జెప్పుకొనుట సమంజసముగా దోచును. అర్థశబ్దము పదార్థశబ్దపరము. 'పదస్యార్థః పదార్థః' అను వ్యుత్పత్తి ననుసరించి యీ యర్థమభిధాశక్తివలన యవగత మగును. అభిధ యనగా" ఈశబ్దముచే నీయర్థము తెలియఁబడ వలెను; లేదా యీ పదమీ యర్థమును భోధించును గాక!" యను నీశ్వరసంకల్పమని తార్కికసంప్రదాయము. * ఈవిధ మగు జ్ఞానాధారమైన యాత్మ తొలుత పదార్థములను మనసున కందించును. వక్తకుఁ గలుగు తొలి యవస్థయిది.- తదుపరి యా మనస్సు జాఠరమగు నగ్ని నుద్దీపింపనది సర్వశరీరాన్తస్సంచారి యగు (ప్రాణ) వ్యానాఖ్య వాయువును ♦ ప్రేరేపించును. ఈ విధముగా సంస్కారాధారభూతమగు నాత్మమనఃసంయోగము,

‡ జ్ఞానాధికరణమాత్మా తర్కసంగ్రహము) * 'అస్మాచ్ఛబ్దాదయమర్థోబోద్ధవ్య ఇతి అథవా శబ్దో2యమిమమర్థం బోధయత్వితి ఈశ్వర సంకల్పః‡ అభిధా- (తర్కసంగ్రహము) ♦ వ్యానస్సర్వ శరీరగః - (అమర ॥ స్వర్గ వర్గః॥)

తద్వారా ప్రాణవాయుసంచారము జరుగుట వర్ణోచ్చారణ మున ప్రారంభదశగా నెఱుఁగ వలెను. ఈక్రియ కేవల మనుమాన నిరూపితంబయ్యును విజ్ఞానశాస్త్రసమ్మతమై యీనాటికిని భాషాశాస్త్రజ్ఞుల పరీక్షకు నిలచినది.

అవ:- ఉక్తరీతిని ప్రేరితమగు నీ వాయువేమార్గమున సంచరించును? అది యేస్వరముల నేవిధముగ నెచ్చోటుల జనింపచేయునను నంశముల నాచార్యుఁడు శ్లోకత్రయమూల మున నిట్లు ప్రస్తావించు చున్నాడు:

శ్లో॥ మారుతస్తూరసి చరన్ మన్ద్రం జనయతి స్వరమ్।
ప్రాతఃసవనయోగం తం ఛన్దో గాయత్రమాశ్రితమ్॥

అర్థ:- మారుతస్తు- (పై రీతిని ప్రేరేపింపఁబడిన) వాయువైతే; ఉరసి - హృద్దేశమున; చరన్-భ్రమించుచు; ప్రాతఃసవనయోగం - ప్రాతస్సంధ్యోపాసన మన్త్రప్రయుక్త మగు; గాయత్రంఛన్దమాశ్రితమ్ - గాయత్రీఛందమునాశ్ర యించినదై; తమ్-అప్రసిద్ధమగు; స్వరమ్-స్వరమును; జన యతి-పుట్టించును; అనగా హృదయాన్తరాళముల సంచరించు నపుడు పైవిధముగా ప్రేరేపింపఁబడిన ప్రాణవాయువు గాయత్రీఛందోనుకూలమగు స్వరమును పుట్టించునని భావము.

శ్లో॥ కంఠే మాధ్యన్దినయుగం మధ్యమం త్రైష్టుభానుగమ్।
తారం తార్తీయసవనం శీర్షణ్యం జాగతానుగమ్॥ 8

అర్థ :- పై శ్లోకమునుండి మారుతః యనుపదము నధ్యాహారము దెచ్చుకొని యన్వయించుకొనవలెను. కాగా:- మారుతః- ఉక్తప్రాణాఖ్యమగువాయువు; కణ్ఠే-కణ్ఠదేశమునందు; త్రైష్టుభానుగమ్-త్రిష్టుభ్ ఛన్దానుసారియగు; మాధ్యన్దినయుగమ్- మాధ్యాహ్నికసవనకర్మసాధనమన్త్రోపయోగియగు మధ్యమమ్-మధ్యమస్వరమును; శీర్షణ్యామ్-శిరోగతమై; జాగతానుగమ్ - జగతీఛందోనుసారియగు; తార్తీయసవనమ్ - తృతీయమగు సాయంసవనకర్మసాధనమన్త్రోపయోగి యగు తారమ్=ఉచ్చస్వరమునకుఁ జెందిన స్వరమును; (జనయతి- పుట్టించును.) కలుగఁజేయునని భావము.

ఇందీవిధముగ నాద్యన్త పదములు 'మారుతః, జనయతి' అనునవి, ప్రకరణానుసారముగ నధ్యాహార్యములు. పాణినీయ శాస్త్ర పరిభాషలో ననువర్తించునని చెప్పిన చెప్పవచ్చును.

ఇక శీర్షమునుఁజేరి, తదభిఘాతముచే నావాయువు వక్త్రమునుపొంది తత్తద్వర్ణవ్యంజకశబ్దముల జనింపజేయుట నాచార్యుఁడిట్లని ప్రస్తావించును-

శ్లో॥ సోదీర్ణో మూర్ధ్న్యభిహతో వక్త్రమాపద్యమారుతః।
వర్ణాన్ జనయతే తేషాం విభాగః పఞ్చధా స్మృతః 9

అర్థ :- సః-ఆప్రసిద్ధమగు ప్రాణాఖ్యవాయువు; ఉదీర్ణః-ఊర్ధ్వముఖముగా ప్రేరేపింపఁబడి; మూర్ధ్ని-శిరస్సు

నందు; అభిహతః-అభిఘాతాఖ్య సంయోగము నొంది (అనగా ఢీకొని); వక్త్రమాపద్య-(పరావర్తనము చెంది) ముఖమును అనగా కంఠతాల్వాది స్థానదేశములం బొంది; వర్ణాన్-వర్ణములను (అనగా వర్ణవ్యంజక శబ్దములను); జనయతే-పుట్టించును. తేషాం-ఈవిధముగా నుత్పన్నములైన వర్ణములయొక్క; విభాగః-విభజనము (వింగడింపు); పఞ్చధా-ఐదువిధములుగా; స్మృతిః-చెప్పఁబడినది.

వ్యాః- పై యెనిమిదియవ శ్లోకములో "తార్తీయ సవనమ్" అనుదానికి సాయంసవనమని లక్షణార్థము వచించుట యుక్తము. పై శ్లోకములలోని 'ప్రాతఃసవన, మాధ్యన్దిన'-శబ్దములు రెండును లక్షకములు. అవి జ్యోతిష్టోమాదులందు ప్రసిద్ధములగు ప్రాతఃసవనాది కర్మసాధనమన్త్ర పరములుగా నెఱుఁగునది. అనగా వానినిఁబోలిన స్వరము లుద్భవించునని భావము. వైదిక సంప్రదాయమునకు సంబంధించిన గ్రంథము గావున వైదికచ్ఛందములనే యాచార్యుఁడుదాహరించినాఁడు.

సూక్ష్మదృష్టితో పరికించిన వర్ణోచ్చారణ పద్ధతి యిట్లు గోచరించును.-

పదార్థజ్ఞానానన్తరము శబ్దప్రయోగేచ్ఛచే నాత్మ నియుక్తమగుమనస్సు, నాభిదేశమునందలి జాఠరమగు నగ్ని నుద్దీపింపజేసి, యటగల ప్రాణాఖ్య వాయువునుఁ బ్రేరేపింపః

నది యత్యన్త వేగముతో, హృదయాది స్థానముల ద్వారమున మూర్ధను తాకి, యటనుండి పరావర్తనము జెంది వక్త్రము బ్రవేశించి ఆయా కంఠతాల్వాది స్థానముల నుండి నిర్గమించు నెడ వానిని స్పృశించును. నిర్గతమగు నా వాయువా తాకిడికి అభివ్యక్త శబ్దస్వరూపముం దాల్చును. ఈవిధముగా వర్ణములు తత్సముదాయస్వరూపములగు పదములు, వాక్యములు నుచ్చరింపఁబడు చున్నవి.

## వర్ణ విభాగము

అవ:- వర్ణోచ్చారణ విధానముఁ దెలిపిన యనంతరము పైఁజెప్పిన యుద్దేశక్రమానుసారము వర్ణవిభాగము నైదు విధములుగ నిర్దేశించుచున్నాడు.

శ్లో॥ స్వరతః కాలతః స్థానాత్ప్రయత్నానుప్రదానతః।
ఇతి వర్ణవిదః ప్రాహు ర్నిపుణం తన్నిబోధత॥ 10

అర్థ:- వర్ణవిదః- వర్ణస్వరూపజ్ఞులగు పండితులు; స్వరతః- స్వరభేదము చేతను; కాలతః- కాలభేదము చేతను; ప్రయత్నానుప్రదానతః- బాహ్యాభ్యన్తరప్రయత్నముల చేతను; (వర్ణ భేదములను); ప్రాహుః- చెప్పిరి; తత్ -దానిని; నిపుణమ్- స్ఫుటముగా; నిబోధత- తెలిసికొనుఁడు.

వ్యా:- స్వర-కాల-స్థాన- బాహ్యాభ్యన్తర- రూప ప్రియత్న భేదముల ననుసరించి వర్ణము లైదువిధములుగా విభజింపఁబడినవి.

-: స్వరమునుబట్టి, కాలమునుబట్టియు విభాగము :-

శ్లో॥ ఉదాత్తశ్చానుదాత్తశ్చ స్వరితశ్చ స్వరాస్త్రయః।
హ్రస్వోదీర్ఘః ప్లుత యితి కాలతో నియమా అచి॥ 11

అర్థ :- ఈశ్లోకమున 'అచి'- యనునది సప్తమ్యన్తము. ఇచట సప్తమికి వైషయికార్థముఁ జెప్పఁగొనవలెను. కాఁగా:- అచి-అజ్విషయములో; ఉదాత్తశ్చ-ఉదాత్తమనియు; అనుదాత్తశ్చ-అనుదాత్తమనియును; స్వరితశ్చ-స్వరితమనియును; త్రియః-మూఁడు; స్వరాః-స్వరములు; మరియు-కాలతః-కాలము ననుసరించి, (కాలమననిచట నుచ్చారణకాలమని యర్థము); హ్రస్వః-హ్రస్వము; దీర్ఘః-దీర్ఘము; ప్లుతః-ప్లుతము; (అని) నియమాః-నియమనములు. (గావింపబడినవని భావము).

వ్యా- అజ్విషయమున స్వరము నాధారముగాఁగొని- 1) ఉదాత్తము[1] పైకెత్తి పలుకబడునది, 2) అనుదాత్తము[2] క్రిందుగాలాగిపలుకఁబడునది, 3) స్వరితము[3]- మధ్యగా

---

1. ఉచ్చై రుదాత్తః (అష్టాధ్యాయి. సూ. 1-2-29)
2. నీచై రనుదాత్తః ( ,, . సూ. 1-2-30)
3. సమాహారః స్వరితః( ,, . సూ. 1-2-31)

నూదిపలుకఁబడునది, యని మూడువిభాగములును; ఉచ్చారణ కాలము ప్రాతిపదికపై (1) హ్రస్వము (ఏకమాత్రాపరిమాణకవర్ణము), (2) దీర్ఘము – (ద్విమాత్రికము), (3) ప్లుతము (త్రిమాత్రికము), అని మూఁడు విభాగములును; సూచింపఁబడినవి. ఏకవర్ణోచ్చారణ కాలమును లేక కనురెప్పపాటు ప్రమాణముగ పలుకు ఒక అచ్చును మాత్రయని వ్యవహరింతురు. ఇచట వర్ణశబ్దముచే వర్ణసమామ్నాయోపదిష్ట వర్ణమునే గ్రహింపవలెనని భావము.

**అవ:** ప్రాసిద్ధికముగా సంగీతశాస్త్రప్రసిద్ధస్వరము లన్నియు నుక్తస్వరములలో నన్తర్భూతములగునను విషయము ను కవి ప్రస్తావించుచున్నాడు.

శ్లో॥ ఉదాత్తే నిషాదగాన్ధారా ౨ వనుదాత్త ఋషభధైవతౌ ।
స్వరితప్రభవా హ్యేతే షడ్జమధ్యమపఞ్చమాః॥ 12

**అర్థ:** ఉదాత్తే – ఉదాత్తస్వరమందు; నిషాదగాన్ధారౌ – నిషాదగాన్ధారస్వరములును; అనుదాత్తే – అనుదాత్తస్వరమునందు; ఋషభధైవతౌ - ఋషభ, ధైవతములను స్వరములును; (అన్తర్భూతములగునని భావము). షడ్జమధ్యమపఞ్చమాః – షడ్జమధ్యమ పఞ్చమములనఁబడెడు; ఏతే - ఈస్వరములు; స్వరితప్రభవాః - స్వరితస్వరోద్భవములు.

**వ్యా:** సంగీతశాస్త్రమున వీని నిర్వచనము లెట్లున్నను, అమరుడుమాత్రము నిషాదము* గజఘీంకారమును బోలియుండుననియు, గాంధారస్వనము ♦ మేకలగొఱ్ఱెల స్వనమునుఁ బోలి యుండు ననియు; ఆంకెల మరియు నంబారవముఁ బోలి ఋషభస్వరము ‡ ండుననియు; ధైవతము §, హయ హేషారవమునుఁ బోలి యుండు ననియు; షడ్జస్వరము † మయూరపు కేకానాదముఁ బోలి యుండు ననియు; మధ్యమస్వరము £ క్రౌఞ్చనినాదముఁ బోలియుండుననియు; వసంతసమయమున కోకిలకలకూజితమువలె పఞ్చమస్వరము*ండు ననియు; వచించినాడు. ఈ విధముగా నీస్వరజాతమంతయు నుదాత్తాది త్రికాన్తర్భూతమని యాచార్యుని యాశయముగాఁ దోచును.

## స్థానముననుసరించి విభాగము:

**అవ:** కాఁగా, వర్ణోచ్చారణక్రమమునందు మూడవదగు స్థానభేదమిట్లు వివరింపఁబడుచున్నది. ఇది చాల ముఖ్య

---

* నిషాదం బృంహతే గజః

♦ అజావికం తు గాంధారం ।

‡ గావస్త్వృషభభాషిణః ।

§ ధైవతం హేషతే వాజీ ।

† షడ్జం మయూరో వదతి ।

£ క్రౌఞ్చః క్వణతి మధ్యమమ్ ॥

* పుష్పసాధారణే కాలే పికః కూజతి పంచమమ్.

(అమరకోశము - ప్రథమకాండము నాట్యవర్గు శ్లో॥ 2 & 3)

మైనది. స్థానముల ననుసరించి వర్ణోత్పత్తిస్థానములను తొలుత నాచార్యుఁడుపదేశించుచున్నాఁడు.

శ్లో॥ అష్టౌ స్థానాని వర్ణానాముర: కంఠః శిరస్తథా।
జిహ్వామూలం చ దన్తాశ్చ నాసికోష్ఠౌ చ తాలు చ॥ 13

**అర్థ**: వర్ణానామ్ - వర్ణములకు; అష్టౌ - ఎనిమిది; స్థానాని - ఉత్పత్తిస్థానములు. అవి - 1. ఉరః - వక్షము; 2. కణ్ఠః - కంఠము; 3. శిరః - తల లేక మూర్ధ; 4. జిహ్వామూలమ్ - జిహ్వామూలము (నాలుక మొదటిభాగము); 5. దన్తాః - దంతములు; 6. నాసికా - ముక్కు; 7. ఓష్ఠౌ - పెదవులు; 8. తాలుచ - అంగుటిపై భాగమును; (దీనినే తాలుప్రదేశమని యందురని కొందరివాదము.)

## అష్టవిధ విసర్గ విపరిణామములు

**అవ:** విషయాన్తరము నొకదానిని ప్రాసఙ్గికముగాఁ బ్రస్తావింపనెంచి, యూష్మసంజ్ఞకమగు విసర్గముయొక్క పరిణతి నష్టవిధములుగా వివరించుచున్నాఁడు.

శ్లో॥ ఓభావశ్చ వివృత్తిశ్చ శషసా రేఫ ఏవచ।
జిహ్వామూలముపధ్మా చ గతిరష్టవిధోష్మణః॥ 14

**అర్థ**: ఊష్మణః - విసర్గమునకు; ఓభావః - ఓకారముగ పరిణతియును; వివృత్తిశ్చ - విసంధియును; శషసాః -

శవర్ణ, షకార, సకారరూపమున పరిణతినొందుట; రేఫ ఏవ చ – రేఫముగనున్నూ; జిహ్వామూలమ్ - జిహ్వామూలము (ఀక) గను; ఉపధ్మా చ - ఉపధ్మానీయము (ఀప) గను; అష్టవిధః - ఎనిమిదివిధములగు; గతిః – (గమనము) పరిణతి గలదని భావము.

**వ్యా:** ఈశ్లోకమున విసర్గమునకూష్మసంజ్ఞ గావింపఁబడినది. ఈవిధముగ విసర్గమునకూష్మసంజ్ఞాకరణము వ్యాకరణాన్తరములందు ప్రసిద్ధము. ఇది లాక్షణిక ప్రయోగము. ఈసంజ్ఞాకరణమూష్మలయందు విసర్గమునకు పాఠముండుటచే తాత్స్థ్యమునుబట్టి - అనగా 'మంచాఃక్రోశన్తి' యను స్థలమున 'మంచ' శబ్దమునకు లక్షణనాశ్రయించి మంచస్థపురుషుఁడని యర్థము వచింపఁబడినరీతి నూహింపఁదగును. కాఁగా, నూష్మలయందేకదేశమగు విసర్గమునకీవిధముగా నూష్మసంజ్ఞ విధింపఁబడినట్లు చెప్పవచ్చును.

1. ఓభావమనగా విసర్గము 'ఓ'కారముగా పరిణతినందుట. శివః+వన్ద్యః - అనుచోట విసర్గమోకారముగా మారి - 'శివో వన్ద్యః' - అను రూపమేర్పడినది. ఇది ఓభావమునకుదాహరణము.

2. వివృతి యనగా సంధ్యభావమని యర్థము. ఈ యర్థము యాజ్ఞవల్క్యశిక్ష యందిట్లు వివరింపఁబడినది –

శ్లో॥ ద్వయో స్తు స్వరయోర్మధ్యే సంధిర్యత్ర న దృశ్యతే।
వివృతి స్తత్ర విజ్ఞేయా య ఈశేతి నిదర్శనమ్॥

ఈ శ్లోకమునందే 'య(ః) ఈశః' అనుచోట సంధ్యభావ ప్రకారమగు నుదాహరణముకూడఁ జూపఁబడినది. ఇక విసర్గము - శ, ష, స, రేఫ జిహ్వామూలీయోపధ్మానీయము లుగాఁ బరిణతినొందిన స్థలములనించుక పరికింతము -

3. విసర్గము శవర్ణముగా పరిణతిజెందుట -
ఉదా: హరిః + శేతే - హరిశ్శేతే.

4. విసర్గము షకారముగా పరిణతిఁజెందుట -
ఉదా: ఆవిః + కృతమ్ - ఆవిష్కృతమ్.

5. విసర్గము సకారముగా పరిణతిఁజెందుట -
ఉదా: కః + కః - కస్కః.

6. విసర్గము రేఫముగా పరిణమించుట -
ఉదా: అహః + పతిః - అహర్పతిః.

7. విసర్గము జిహ్వామూలీయము (ᳵక)గా మారుట -
ఉదా: కః + కరోతి - కᳵకరోతి.

4. విసర్గముపధ్మానీయము (ᳶప) గా పరిణమించుట -
ఉదా. కః + పచతి - కᳶపచతి

కొందరీశ్లోకమిచట నసంగతమనియు దీనినిటఁ బ్రస్తావింపఁబనిలేదనియు నభిప్రాయపడిరి. అది యుక్తమే యైనను దీనినిటఁ బ్రస్తావించుటలో స్వారస్యముకూడ లేకపోలేదు

ఏలన తొలుత నష్టసంఖ్యలోనున్న స్థానములఁజెప్పి, తదనన్తర మష్టసంఖ్యాకములగు విసర్గవిపరిణామములు వివరింపఁబడినవి. అష్టసంఖ్యావత్త్వము రెండింటియందును సమానధర్మముగా గోచరించుచున్నది గదా! తుల్యధర్మములగల వీరెంటిని తుల్య ప్రదేశమున నుంచుట యుక్తమని యాచార్యుఁడు దలంచె నేమో !!

**అవః** పైరీతిని ప్రసక్తమైన 'ఓభావ'స్వరూపము నాచార్యుఁడు ప్రస్తావించుచున్నాఁడు.

శ్లో॥ యద్యోభావప్రసన్ధానముకారాదిపరం పదమ్ ।
స్వరాన్తం తాదృశం విద్యాద్యదన్యద్వ్యక్తమూష్మణః ॥ 15

**అర్థః** ఈ శ్లోకమున 'యత్ర' 'తత్ర' యను పదము లధ్యాహార్యములు. కాఁగా, యత్ర - ఏపదమునందు; ఉకారాదిపదమ్ - ఉకారమాదిగాగల పదము; పరమ్ - పరముగా నుండునో; (తత్ర - అచట); ఓభావప్రసన్ధానం చేద్యది - ఓకార పరిజ్ఞానమున్నట్లయినః; తాదృశమ్ - అట్టి ఓకారమును; స్వరాన్తమ్ - అచ్స్థానికముగా; విద్యాత్ - తెలిసికొనవలెను; అన్యద్ - వేరువిధమైన యోభావప్రసన్ధానము; (పైఁ జెప్పఁబడినరీతిని) ఊష్మణః - విసర్గస్థానికమైనదిగ; వ్యక్తమ్ - తెలియఁబడినది. (పూర్వతనశ్లోకమునఁ బ్రస్తావింపఁబడినదని భావము).

**వ్యా:** విసర్గమునకుఁ బరముగా నుకారాది పదమున్నప్పుడు వచ్చెడి 'ఒభావము' నచ్స్థానముగను; తదితరమగు 'ఒభావము'ను విసర్గస్థానికముగను తెలియఁదగును. ఈవిషయము పరిశీలింపవలసియున్నది. వైదిక ప్రయోగములకు సంబంధించినదై యియ్యది ప్రాతిశాఖ్యలయందు సమగ్రవివరణమునుఁ బొందియుండవచ్చును.

**స్థానవిచారము:-** ఉక్తరీతిని (చూ.శ్లో. 13). స్థానములఁ జెప్పి, పిమ్మట యేవర్ణ మేస్థానమున నుచ్చరింపఁబడుచున్నదో తెలుపుచున్నాఁడు:-

శ్లో॥ హకారం పఞ్చమైర్యుక్త మన్తఃస్థాభిశ్చ సంయుతమ్ ।
ఉరస్యం* తం విజానీయాత్ కంఠ్యమాహు -
రసంయుతమ్॥ 16

**అర్థ:** పఞ్చమైః — వర్గపఞ్చమాక్షరములగు ఙ-ఞ-ణ-న-మ లతో; యుక్తమ్ - కూడినదియు; అంతఃస్థాభిశ్చ సంయుతమ్ - అంతఃస్థవర్ణములగు య-ర-ల-వ లతోఁ గూడినదియునగు; హకారమ్ - హకారమును; ఉరస్యమ్ - ఉరఃస్థానికమైనదిగా; విజానీయాత్ - తెలిసికొనవలెను; అసంయుతమ్-(అట్లుగాక పైఁజెప్పిన వర్ణములతో) సంయోగములేని; తమ్ - దానిని; కంఠ్యమ్ - కంఠస్థానికముగా; ఆహుః - (వ్యాకరణాచార్యులు) చెప్పిరి.

---

* 'ఔరస్యం' అని పాఠాన్తరము.

**వ్యా:** భావము స్పష్టముగానున్నందున వ్యాఖ్యన మేతద్విషయమున ననవసరము. కాఁగా, నిచట హకారమురః స్థానికముగను, కంఠ్యముగను నిర్దేశింపఁబడినది. 'హ్మాలయతీః, హ్యాదులందున్న హకారమకారసము. 'హలః, గేహమ్' మొద లగు పదములందున్న హకారము కంఠ్యమని తత్త్వము.

**అవ:** ఈవిధముగా హకారభేదముల నుచ్చారణ స్థానముల ననుసరించి తెల్పిన పిదప సవర్ణసంజ్ఞ కుపయో గించు స్థానములఁ దెలుపుచున్నాఁడు:-

శ్లో॥ కంఠ్యావహావిచుయశా స్తాలవ్యా ఓష్ఠజావుపూ ।
స్యుర్మూర్ధన్యా ఋటురషా దన్త్యా ఌతులసాః స్మృతాః॥ 17

**అర్థ:** అహౌ - అకారహకారములు; కంఠ్యౌ - కంఠస్థానజములు; ఇచుయశాః - ఇకారము, చవర్గ, యకార శవర్ణములు; తాలవ్యాః - తాలుస్థానజాతములు; ఉపూ - ఉకారపవర్గలు; ఓష్ఠజౌ - ఓష్ఠస్థానమునఁ బుట్టినవి, (అని తెలిసికొనవలెనని భావము.) ఋటురషాః - ఋకారము, టవర్గ, రేఫషకారములుకలసి; మూర్ధన్యాః - మూర్ధన్యవర్ణ ములు (అంగుటిస్పర్శవలన పుట్టినవి.); స్యుః - కాఁగలవు. ఌతులసాః - ఌకారము, తవర్గ, లకారసకారములు కలసి; దన్త్యాః - దన్త్యవర్ణములుగా; స్మృతాః - తెలియఁబడు చున్నవి.

**వ్యా:** భావము స్పష్టము. దీని ననుసరించియే కాఁబోలు, సిద్ధాన్తకౌముదీకారుఁడగు దీక్షితపండితుఁడు - "అకుహవిసర్జనీయానాం కణ్ఠః; ఇచుయశానాం తాలు; ఋటురషాణాం మూర్ధా; ఌతులసానాం దన్తాః; ఉపూపధ్మానీయానామోష్ఠౌ" - అని స్థానములను వచించియుండవచ్చును.

ఇచట శ్లోకమునందలి దన్త్యపదమునకు దన్తములు స్థానముగాఁగల వర్ణములని యర్థము. ఈస్థలమున దన్తపదమునకు దన్తసంయుక్తప్రదేశము (అనగా దంతమూలము) అని యర్థమును వచించుట యుక్తము. లేకున్నచో దన్తములు భగ్నమైనవాని విషయములో నా దన్త్యవర్ణోచ్చారణమసంభవము కాఁగలదు. కాని, లోకమున భగ్నదంతులుకూడ లకార తకారాది వర్ణములనుచ్చరించుటను చూచుచున్నాము. 'గంగాయాం ఘోషః' - అనుచోట గంగాపదమునకు తీరార్థమును లక్షణనాశ్రయించి చెప్పుకొనినట్లిచటఁగూడ నీదన్తపదమునకు దన్తసమీపప్రదేశమనునర్థముఁ జెప్పుటుచితముగా గనుపట్టును.

**అవ:** ప్రాసఙ్గికముగా నిట ననేకస్థానకవర్ణములనుగూడ సంగ్రహించుచున్నాఁడు :

శ్లో॥ జిహ్వామూలేతు కుః ప్రోక్తో దన్త్యోష్ఠ్యో వః స్మృతో బుధైః ।
ఏఐతు కణ్ఠతాలవ్యా ఓఔ కణ్ఠోష్ఠజౌ స్మృతౌ॥ 18

**అర్థ:** బుధైః = పండితులచే; జిహ్వామూలే = జిహ్వామూలమునందు (నాలుక మొదట); కుః - కవర్గ; ప్రోక్త - చెప్పఁబడినది. వః - వకారము; దన్త్యోష్ఠ్యః - దన్తములు, ఓష్ఠము స్థానముగాఁగలదిగా; స్మృతః - చెప్పఁబడినది. ఏఐతు - ఏ, ఐలైతే; కంఠతాలవ్యా - కంఠతాలు స్థానజన్యములుగను; ఓ, ఔ - ఓఔలు; కంఠోష్ఠజౌ - కంఠోష్ఠములందు పుట్టునవిగను; స్మృతౌ - చెప్పఁబడినవి.

**వ్యా:** ఇచట విచారణీయస్థల మొకటి కలదు కవర్గకు జిహ్వామూలము స్థానముగాఁ జెప్పఁబడినది. సిద్ధాన్త కౌముదీకర్త యగు భట్టోజీదీక్షితపండితుఁడు మాత్రము - 'అకుహవిసర్జనీయానాం కంఠః' - అని కవర్గమునకు కంఠమును స్థానముగాఁ బేర్కొనినాఁడు. అచట కంఠ పదమునకు - తత్సమీపవర్తి యగు జిహ్వామూలమునుఁగూడ నర్థముగా గ్రహించి, జిహ్వామూల - కంఠపదముల రెంటికి నభేదవివక్ష గావించినట్లు గోచరించును.

మఱియు నీస్థలమందింకొక సందియముకూడ పొడసూపవచ్చును జిహ్వామూలీయమను పదమునకు 'ᳵక' యని యర్థమా? లేదా, కవర్గీయాక్షరమేదైనను కావచ్చునా? యను సంశయమాపదశ్రవణాన స్వరము కలుగుట కవకాశమున్నది. కాని, జిహ్వామూలీయపదము రూఢ్యర్థముచే 'ᳵక' నే బోధించును. "ప్రమాణవ్యవహారాభ్యామర్థనిర్ణయః" - అనెడి

సంప్రదాయము ననుసరించి జిహ్వామూలీయ వ్యవహారమున 'ఁక'నే గ్రహింపవలెనని తత్త్వమవగతమగుచున్నది.

## ఏజ్వర్ణములయుచ్చారణము

సంధ్యక్షరములగు ఏ-ఓ-ఐ-ఔల యుచ్చారణము నాచార్యు డెంతయు వైజ్ఞానికముగా వివరించును.

శ్లో॥ అర్ధమాత్రాతు కంఠ్యస్య* ఏకారైకారయోర్భవేత్ ।
ఓకారౌకారయోర్మాత్రా తయోర్వివృతసంవృతమ్॥ 19

**అర్థ:** ఏకారైకారయోః - ఏ - ఐ ల రెండింటి యొక్కయు; ఓకారౌకారయోః - ఓ, ఔ ల యొక్కయు, (ఉచ్చారణమునందు); అర్ధమాత్రా - అర్ధమాత్రాపరిమాణము; తు - లేదా; మాత్రా - (ఏక) మాత్రాపరిమాణము; కంఠ్యా - కంఠస్థానికము; స్యాత్ - అగును; తయోః = ఆయుభయద్వంద్వములయొక్కయు; (ప్రయత్నము); వివృతసంవృతమ్ - వివృతసంవృతాన్యతరముగా; భవేత్ - అగును.

**వ్యా:** ఏ - ఐలు కంఠతాలవ్యములుగను, ఓ ఔలు కంఠోష్ఠ్యములుగను చెప్పఁబడినవి. కంఠ్యత్వము వీటన్నిటను సమానధర్మముగా గోచరించును. దాని పరిమితి యర్ధమాత్రా కాలముగాని లేదామాత్రాకాలముగాని కావచ్చును.

---

* 'కంఠ్యాస్యాత్' అని పాఠాన్తరము.

మరియు శ్లోకమునందలి 'తు' - యనునవ్యయమునకు ప్రసంగానుసారముగా వికల్పార్థముఁ జెప్పుకొనుట యుక్తము. ఈ కంఠ్యము వివృతసంవృతాన్యతరముగాగాని, తన్మిశ్రితము గాగాని యుండవచ్చును.

**అవ:** పై శ్లోకమునం దేజ్వర్ణముల, (ఏ,ఓ,ఐ,ఔ-ల) యుచ్చారణమునందలి సామాన్యమగు కంఠ్యభాగము, మాత్రికమైనను, నర్ధమాత్రికమైనను గావచ్చుననియు, ప్రయత్నము వివృతసంవృతాత్మకమనియు చెప్పఁబడినది. కాని, యేది వివృతము? ఏది సంవృతము? ఏదర్ధమాత్రికము? యేది మాత్రికము? అను నంశములందు వివరింపఁబడలేదు. ఒక శ్లోకపాదముచే నాచార్యుఁడీసంశయములఁ దొలఁగించుచు నిట్లని ప్రస్తావించును:

శ్లో॥ సంవృతం మాత్రికం జ్ఞేయం వివృతం తు ద్విమాత్రికమ్॥

**అర్థ:** సంవృతమ్ - సంవృతప్రయత్నముకలది: మాత్రికమ్ - ఏకమాత్రాపరిమాణము కలదగను; వివృతమ్ - వివృతప్రయత్నము కలది; ద్విమాత్రికమ్- ద్వైమాత్రికపరిమాణము కలదిగను; జ్ఞేయమ్ - తెలిసికొనవలెను.

**వ్యా:** కాఁగా, సంవృతప్రయత్నజములగు నేజ్వర్ణము లేకమాత్రికములనియు, వివృతప్రయత్నజములు ద్విమాత్రికములనియు, ఫలితార్థము:

సూక్ష్మదృష్టికతోఁ బరిశీలింపగా నేజ్వర్ణముల విషయములో, ఏ, ఓ ల యుచ్చారణమునందలి కంఠ్యమర్ధమాత్రి

కము; సంవృతప్రయత్నజన్యమైనదియు; ఐ-ఔల యుచ్చారణమునందలి కంఠ్యము మాత్రికమును, వివృతప్రయత్నజన్యమైనదనియు; నెఱుఁగవలెను.

ఈ విభాగమునకనుకూలముగనే పాణిని ఏజ్వర్ణముల కాదేశములను 'ఏచోఽయవాయావః' (7-1-78)—అని సూత్రీకరించెను. దానినొక్కింత బరిశీలింతము:—ఏ-ఓ-ఐ-ఔలకుఁ గ్రమముగా విధింపఁబడిన అయ్-అవ్-ఆయ్-ఆవ్‌లను నాదేశములందు మొదటి రెండింటియందును కంఠ్యమగు 'అ'కారము సంవృతముగను, తరువాతి యాదేశద్వయగతమగు 'ఆ'కారము వివృతము ద్విమాత్రికముగను నున్నవి. 'స్థానేఽన్తరతమః' (1-1-50) అను సూత్రముననుసరించి సంవృత కంఠస్థానకములగు ఏ-ఓలకు సంవృతకంఠ్యములగు అయ్-అవ్‌లు; వివృతకంఠస్థానకములగు ఐ-ఔలకట్టివే యగు ఆయ్-ఆవ్‌లాదేశముగా విధింపఁబడినవి. ఇటుల వ్యవస్థఁ దప్పక సూత్రీకరించుటచే పాణిన్యుపజ్ఞమగు నీ వ్యాకరణమెంతయు వైజ్ఞానికమై ప్రామాణిక గ్రంథముగా నేటికినాదరింపఁబడుచున్నది.

## ప్రయత్నమును బట్టి విభాగము

**అవ:** ఇట్లుజ్వర్ణముల యుచ్చారణమును స్పష్టీకరించిన యుపన్తరమాచార్యుఁడు ప్రాసఙ్గికముగా నుద్దేశ్యక్రమము ననుసరించి, వర్ణోచ్చారణము నందలి ప్రయత్నముల నించుక ప్రస్తావించుచున్నాఁడు:

శ్లో॥ ఘోషావా సంవృతాస్సర్వే అఘోషా వివృతా
స్మృతాః । 20

శ్లో॥ స్వరాణా మూష్మణాం చైవ వివృతం కరణం స్మృతమ్।
తేభ్యోఽపి వివృతావేఙౌ తాభ్యామైచౌ తథైవ చ ॥ 21

**అర్థ:** సర్వే - సమస్తమైన; ఘోషాః - ఘోష సంజ్ఞకవర్ణములు; సంవృతాః - సంవృతాఖ్య (ఆభ్యన్తర) ప్రయత్నముకలవిగను; అఘోషాః - అఘోషసంజ్ఞకవర్ణములు; వివృతాః - వివృత ప్రయత్నముకలవిగను; స్మృతాః - చెప్పఁబడినవి.

స్వరాణామ్ - స్వరముల (అచ్చుల) యొక్కయు; ఊష్మణాం చైవ - శ.ష,స,హాలను నూష్మసంజ్ఞకవర్ణములకు; వివృతమ్ - వివృతాఖ్యమగు నాభ్యన్తరప్రయత్నము; కరణమ్ - ఉపకరణము (సాధకతమము)గా స్మృతమ్ - చెప్పబడినది. తేభ్యోఽపి - వానికన్నను; ఏఙౌ - ఏకారౌకారములు; వివృతౌ - వివృత ప్రయత్నము కలవి. తథైవ - అట్లే; తాభ్యామ్ - ఆయేకారౌకారములకన్నను; చ - కూడ; ఐచౌ - ఐకారౌకారములు; వివృత తరములని శేషార్థము.

**వ్యా:** కౌముదీస్థ 'ఖయాం యమాః' అను శ్లోకము లోవలె నిచటఁగూడ ఘోషసంజ్ఞ*ను గ్రహింపనగును. (దీని

* ప్రాణి సహజమగు వాయువును శ్వాసమని యందురు. దీనికి నాదము ఘోషము అను రెండు ధర్మములుండును.

కది వివరణమని భావము.) ఉక్తశ్లోకమున 'వా' యను పద-
మునకు పాదపూరణముతప్ప వేఱు ప్రయోజనముచూపట్టదు.
కాఁగా ఘోషవర్ణములు సంవృతములు. అఘోషవర్ణములు
వివృతములు. స్వరములు, ఊష్మలు, కూడ వివృతములు.
వానికన్న నేకారోకారములు వివృతతరములు. ఐకారౌకార-
ములు వివృతతమములని ఫలితార్థము.

## అయోగవాహముల స్థాననిర్ణయము

**అవ:** ఉపదిష్టములగు వర్ణముల స్థానప్రయత్నము
లను వచించిన యనన్తరమాచార్యుఁడనుపదిష్టములగు
నయోగవాహముల యుచ్చారణ స్థానముల నిట్లు నిర్దేశించు
చున్నాడు:

శ్లో॥ అనుస్వారయమానాఞ్చ నాసికా స్థానముచ్యతే ।
అయోగవాహా విజ్ఞేయా ఆశ్రయస్థానభాగినః ॥ 22

**అర్థ:** అనుస్వారయమానాఞ్చ - అనుస్వారము
యొక్కయు, యమసంజ్ఞక వర్ణములయొక్కయు; స్థానమ్ -
ఉచ్చారణ స్థానము; నాసికా - ముక్కు(గా); ఉచ్యతే -
చెప్పఁబడుచున్నది. అయోగవాహాః - అయోగవాహములు;
(వర్ణసమామ్నాయమునందుపదేశింపఁ బడని వర్ణములు);
ఆశ్రియస్థానభాగినః - తామాశ్రయించు వర్ణముయొక్క
స్థానమునుఁబొందునవిగా; విజ్ఞేయాః - తెలిసికొనదగినవి.

**వ్యా:** అనుస్వారమనగా పూర్ణబిందువని యర్థము. వర్గప్రథమాక్షరములకు క-చ-ట-త-పల కావర్గపఞ్చమాక్షరములైన జ-ఞ-ణ-న-మ లలో నేదైనను పరమగుచో, పూర్వసదృశవర్ణ మొండు ప్రాతిశాఖ్యములందుఁ బ్రసిద్ధముగాఁ జూపట్టును. అట్టివానిని యమవర్ణము లందురు.
ఉదా: "పలిక్క్నీః, చఖ్ఖ్నతుః, అగ్గ్నిః" – యనుచోట్ల ద్వితీయ వర్ణములను (కకారాదులను) యమసంజ్ఞకములుగా నెఱుఁగునది.*

ఇక నయోగవాహములఁగూర్చి యించుక విచారింత. ము. యోగమనగా వర్ణసమామ్నాయమునఁ జేరియుండుట. తద్రహితములయోగములు. వ్యాకరణ ప్రక్రియాకార్యములను వహించునది వాహము. ఈ 'అయోగ' – 'వాహ' – గుణముల సమ్మేళనరూపములే యయోగవాహములు. వ్యాకరణ గ్రంథములలో నీ యయోగవాహశబ్దమిట్లని వివరింపఁబడినది. "వాహయన్తి – కార్యం నిర్వాహయన్తీతి వాహాః న యోగః – వర్ణసమామ్నాయే పాఠః యేషాం తే – అయోగాః, అయోగాశ్చ తే వాహాశ్చ - అయోగవాహాః ఇతి" ఈ యర్థమే పైన వివరింపఁడినది.

---

* "వర్గేష్వాద్యానాం చతుర్ణాం పఞ్చమే పరే యమోనామ పూర్వసదృశో వర్ణః ప్రాతిశాఖ్యే ప్రసిద్ధః" సిద్ధాన్తకౌముది - వృత్తి 8-2-1)

మహాభాష్యకర్త, అనుస్వార-విసర్గ-జిహ్వామూలీయో-పధ్మానీయ-యమములను 'అయోగవాహములు' గాఁ బరిగణించెను. ఈ యయోగవాహములు తామాశ్రయించిన వర్ణములస్థానముఁ బట్టి యుచ్చరింపఁబడవలెను. అనగా నివి యాశ్రితవర్ణస్థానకములని భావము. ఎట్లన 'రామః' - యను చోట 'అ'కారాశ్రితమగుటఁ జేసి విసర్గ కంఠ్యము. 'హరిః'- అనుచోట 'ఇ'కారాశ్రితమగుటచే తాలవ్యము.

ఇచట నింకొక విశేషము కానవచ్చుచున్నది. పై శ్లోకమున ననుస్వార-యమములకు నాసికను స్థానముగా నిర్దేశించిన పిమ్మట, అయోగవాహముల కాశ్రితవర్ణములస్థాన మాచార్యునిచే నిర్దేశింపఁబడినది. అనుస్వార - యమములయోగవాహముల తరగతిలోనివి. కాఁగా, వానికి నాసిక స్థానమా? లేక, తదాశ్రితవర్ణము స్థానమా? యను సందియముదయించును. పరిశీలింపగా వర్ణాంతరముతోఁ గూడినపుడు అయోగవాహముల స్థానమాశ్రితవర్ణముల స్థానమే యగుననియు, స్వతంత్రావస్థయందు వానిస్థానము నాసిక యనియు నాచార్యుని హృదయముగాఁ దెలియును. కావుననే యనునాసికవర్ణములకు వర్గీయ పఞ్చమాక్షరములకు వర్గస్థానములతో బాటు నాసికాస్థానము కూడ నగునని కౌముద్యాది గ్రంథములందు నిర్దేశింపఁబడినది. ఙకారమునకు కంఠనాసికలు; ఞకారమునకు తాలువునాసికలు; ణకారమునకు మూర్ధ మఱియు నాసిక;...

యీవిధముగా వాని స్థాననిర్దేశము గావింపఁబడినది. కావుననే యచట 'ఞమఙణనానాం నాసికా*చ' యని వచింపఁబడినది. ఈ చకారము పైయర్థమును వ్యక్తము చేయును.

## అనుస్వారోచ్చారణము

**అవ:** అయోగవాహ ప్రసక్తమగు ననుస్వారమునకు సంబంధించిన విశేషములగు నుచ్చారణారీతుల నాచార్యుఁడు వివరించుచున్నాడు:

శ్లో॥ ఆలాబువీణానిర్ఘోషో దన్తమూల్యః స్వరానుగః ।
అనుస్వారస్తు కర్తవ్యః నిత్యం హ్రోః శషసేషు చ ॥23

**అర్థ:** దన్తమూల్యః - దన్తమూలస్థానికమును; స్వరానుగః - అచ్చు ననుసరించియుండునది (అచ్చుపరకమైనది) యునగు; అనుస్వారః - అనుస్వారము (సున్న); హ్రోః - హకారరేఫములు; చ - మఱియు; శ-ష-సేషు = శ-ష-స లు పరములైనపుడును; ఆలాబువీణానిర్ఘోషః - ఆనప తుంబ (డోలక) చే నిర్మింపఁబడిన వీణానాదమువలె; నిత్యం - ఎల్లప్పుడును; కర్తవ్యః - (ఉచ్చారణము) చేయఁదగినది. ఉచ్చరింపఁబడవలెనని భావము.

---

* చూ॥ వృత్తి. సూ॥ తుల్యాస్యప్రయత్నం సవర్ణమ్॥ (1-1-9) సిద్ధాన్తకౌముది సంజ్ఞాప్రకరణము సూ॥ 10.)

వ్యా: పైవిధమగు ననుస్వారమును
హకారము పరమైనపుడు - 'బృంహణమ్' అనుపదములో
వలెను, రేఫముపరమైనపుడు- 'కుణ్డం రథేన' అనుపదములో
వలెను. శ-వర్ణముపరమైనపుడు-'వంశః' అనుపదములో వలెను,
ష-కారము పరమైనపుడు- 'ఇంద్రియాణాంషష్ఠః' అనుపదము
లో వలెను, స-కారము పరమైనపుడు-'హంసః' అనుపదములో
వలెను, ఉచ్చరింపవలెనని తెలియునది.

అవ: అనుస్వారోచ్చారణమును మరల నింకొక
శ్లోకమూలమున విశదీకరించు చున్నాడు:

శ్లో॥ అనుస్వారే వివృత్యాం తు విరామే చాక్షరద్వయే ।
ద్విరోష్ఠ్యౌ తు విగృహ్ణీయాత్ యత్రౌకార
వకారయోః ॥ 24

అర్థ: అనుస్వారే - అనుస్వారము (నెఱసున్న); తు -
వివృత్యామ్ - వివృతియందు (స్వతంత్రముగా) గాని; అథ -
లేదా; విరామే - వర్ణోచ్చారణాభావమున(చివర)గాని; అక్షరద్వయే - సంయుక్తవర్ణ మధ్యమునగాని; యత్ర - ఒకపద
మందు; ఓకారవకారయోః - ఓకారవకారములనుచ్చరించు
నప్పుడుగాని; ఓష్ఠౌ - రెండుపెదవులను; ద్విః - రెండుపర్యాయములు
విగృహ్ణీయాత్ - విప్పికలుపునట్లు పలుకవలెను.

**వ్యా:** అనగా నాయా స్థలములందు పెదవులను ప్రయత్నపూర్వకముగా విప్పి మఱల కలిపి యనుస్వాగము నుచ్చరింపవలెనని భావము.

## వర్ణోచ్చారణసామాన్యపద్ధతి

**అవ:** వర్ణోచ్చారణస్థానప్రయత్నాదులను వైజ్ఞానికముగా విశదీకరించిన యనంతర మాచార్యుడు వర్ణోచ్చారణ సామాన్యపద్ధతిని దృష్టాంతమూలమున నాలంకారికముగా నిట్లు బోధించుచున్నాడు:

శ్లో॥ వ్యాఘ్రీ యథా హరేత్పుత్రాన్ దంష్ట్రాభ్యాం న చ పీడయేత్ ।
భీతా పతనభేదాభ్యాం తద్వద్వర్ణాన్ప్రయోజయేత్ ॥25

**అర్థ:** యథా - ఏవిధముగా; వ్యాఘ్రీ - ఆడుపులి; పతనభేదాభ్యామ్ - పడిపోవుట, లేదా గాయపడుటలవలన; భీతా - భయపడినదై; పుత్రాన్ - పిల్లలను; దంష్ట్రాభ్యామ్- కోఱలరెండింటితో; హరేత్ - తీసికొనిపోవునో; న చ పీడయేత్ - పీడింపదో; తద్వత్ - ఆవిధముగా (అంతజాగరూకతతో); వర్ణాన్ - వర్ణములను; ప్రయోజయేత్ - ఉచ్చరింపవలెను.

**వ్యా:** ఆచార్యునిచే జూపఁబడిన దృష్టాంత మిచట కడు రమ్యముగా సమరినది. నిజమే మఱి! పులి బిడ్డలను

కోతులతోఁబట్టి చనునెడ గట్టిగాఁ బట్టినచో బిడ్డ గాయపడును. అటులని పట్టు సడలించినచో బిడ్డ జాఱిపోవునుగదా! కావున బిడ్డ పడిపోకుండుట కనువగు పట్టుపట్టి పులి బిడ్డలఁ గొనిపోవు రీతిని తగు స్వరములతో తగు మాత్రా పరిమాణములతో తత్తత్ప్రయత్నానుసారముగా వర్ణముల నుచ్చరింపవలెనని యాచార్యుని హృదయము. అనగా వర్ణములను మిగులనొక్కి పలుకక, యటులని తేల్చి పలుకకుండగా వానివాని స్వరము లందుచ్చారణారీతులననుసరించి పలుకవలెనని భావము.

## రఙ్గవర్ణోచ్చారణము

**అవ:** రఙ్గవర్ణమనునది యొక చిత్రమైన వర్ణవికృతి. ఇది సర్వభాషాసామాన్యము సార్వత్రికమునై నేటికిని వ్యవహారమున నున్నను, కేవల శిక్షాగ్రంథములు తప్ప మఱియే వ్యాకరణగ్రంథములుకాని లేక భాషాశాస్త్రీయ గ్రంథములు కాని, దీనినిఁగూర్చి విచారింపకపోవుట యాశ్చర్యమునుఁ గొలుపును. దీర్ఘ–ప్లుత–పరిమాణములకు మధ్యగా కొంచెమనునాసికస్వరముతో నుచ్చరింపఁబడు ద్వైమాత్రిక వర్ణము రఙ్గవర్ణమనఁ బడును. వీధులలో వస్తువిక్రయ సమయమున మన మీ స్వరమును సాధారణముగా వినుచుందుము. ( ఉదా: పెరుగోఁ యమ్మ పెరుగు .. మొ|వి.)

ఈ యుదాహరణమున నోకార మనునాసికముగా నుచ్చరింప బడినదని చూపుటకై 'ँ' అనునాసిక చిహ్నము- (హిందీభాష సంబంధి) ఉంచబడినది. ఈ రఙ్గవర్ణముల యుచ్చారణపద్ధతిని శ్లోకపఞ్చకముద్వారా యాచార్యుడు విశదీకరించుచున్నాడు. ప్రప్రథమముగా రఙ్గస్వరూపమును సోదాహరణముగా నాచార్యుడిట్లు నిర్దేశించును:

శ్లో॥ యథా సౌరాష్ట్రికా నారీ తక్రँ ఇత్యభిభాషతే ।
ఏవం రఙ్గాః ప్రయోక్తవ్యాః 'ఖేఅరాँ' ఇవ
ఖేదయా ॥ 26

అర్థ: యథా - ఏవిధముగా; సౌరాష్ట్రికానారీ - సౌరాష్ట్రదేశపుస్త్రీ; తక్రँ - తక్రా...ఇఁ అని (నిరనునాసికమయ్యు రేఫముననునాసికముగా); అభిభాషతే - ఉచ్చరించునో; ఏవమ్ - ఈప్రకారముగా; రఙ్గాః - రఙ్గవర్ణములు; ప్రయోక్తవ్యాః - ప్రయోగింపఁబడదగినవి. ఈసందర్భమున నుదాహరణముగా 'ఖేఅరాँ ఇవ ఖేదయా' అను వేద వాక్యమును ప్రదర్శించెను. (ఖే - ఆకాశమునందు, ఖేదయా- యిరుసుచే, అరాँ ఇవ - చక్రపురేకులవలెనని యర్థము.)

వ్యా: ఇచట "ఖేఅరాँ" అనుచోట గల యనునాసికరేఫము రఙ్గసంజ్ఞకముగాఁ దెలియవలెను.

'రఞ్జయతి పూర్వవర్ణమితి రఙ్గో వర్ణవిశేషః' - అనగా 'పూర్వవర్ణమును రంజింపచేయునది రఙ్గవర్ణము' అని, పూర్వా

చార్యులచే రఙ్గసర్గము నిర్వచింపబడి కర్తృఘుఙ్ఞన్తముగా స్థిరీకరింపఁబడినది. శాస్త్రీయముగా నకారమునకు రుత్వ ప్రసఙ్గమున విధింపఁబడు ననునాసిక రేఫ మిందులకుదాహరణముగాఁ జూపఁబడినది.

ఈ రఙ్గశబ్దము శిక్షాన్తరములందుఁ గూడఁ బ్రసిద్ధముగాఁ జూపట్టును. నారదీయశిక్షయందుఁ గూడ నకారస్థానికమగు రేఫమే రఙ్గవర్ణముగా నిర్దేశింబడినది.

శ్లో॥ నకారః స్వరసంయుక్త శ్చతుర్ధ్యాక్తో విధీయతే ।
రేఫో రఙ్గశ్చ లోపశ్చ అనుస్వారోఽపి వా
క్వచిత్ ॥

అచ్చును కలిసిన నకారమునకు నాలుగు విధములైన మార్పులు సంభవించును. అవి- రేఫము, రంగము, లోపము, అనుస్వారము అనునవి. ఇందు మొదటి రెండు విధములకునుదాహరణములు వేదభాషయందు కనపడును. లోమశశిక్షా గ్రంథమున రఙ్గద్వైవిధ్యము గూడ 'రఙ్గస్తుద్వివిధో జ్ఞేయః స్వరపరో వ్యఞ్జనపరశ్చేతి' (అవగా అచ్పరకమైనది, హల్పరకమైనది, అని రఙ్గము రెండు విధములు) అని చెప్పఁబడినది.

**అవ:** ఈవిధముగా రఙ్గస్వరూపమును సోదాహరణముగా వివరించిన యనన్తరపతాచార్యుడద్దాని యుచ్చారణక్రమము నుపదేశించుచున్నాఁడు:

శ్లో॥ రఙ్గవర్ణం ప్రయుఞ్జీరన్నోగ్రసేత్పూర్వమక్షరమ్ ।
దీర్ఘస్వరం ప్రయుఞ్జీయాత్పశ్చాన్నాసిక్యమాచరేత్ ॥27

**అర్థః** పూర్వమక్షరమ్ - పూర్వవర్ణమును; నోగ్రసేత్ - మ్రింగివేయకూడదు (అట్లు) రఙ్గవర్ణమ్ - రఙ్గవర్ణమును; ప్రయుఞ్జీరన్ - ప్రయోగింపవలెను; (అత్ర) దీర్ఘస్వరమ్ - దీర్ఘాచ్చును; ప్రయుఞ్జీయాత్ - ప్రయోగించవలెను. పశ్చాత్ - పిమ్మట; (ఆదీర్ఘాచ్చుపై) నాసిక్యమాచరేత్ - అనునాసికస్వరమునాచరింపవలెను.

**వ్యా:** అనగా రఙ్గవర్ణమును దానిపై నాకానోక యనునాసికమగు దీర్ఘాచ్చును కలిపి యుచ్చరింపవలెనని భావము. పూర్వోక్తోదాహరణమునందలి 'తక్రఁ' శబ్దోచ్చారణము 'తక్రాఁ-తక్రాఙ్' అను రీతిని జరుగునని యెఱుఁగునది. ఈవిధమగు రఙ్గోచ్చారణపద్ధతి శిక్షాన్తరములందుఁగూడ చూపట్టుచున్నది. యాజ్ఞవల్క్యశిక్షయందు చెప్పఁబడిన వర్ణోచ్చారణము* సర్వవిధముల దీనిని పోలియున్నది.

**అవ:** రఙ్గవర్ణపుటుచ్చారణకారపరిమితిని మాత్రాద్వయముగా మహర్షి వివరించుచున్నాఁడు:

---

* రఙ్గేచైవ సముత్పన్నే న గ్రాహ్యం పూర్వమక్షరమ్ ।
స్వరం దీర్ఘం ప్రయుఞ్జీత పశ్చాన్నాసిక్యమాచరేత్ ॥ (యాజ్ఞవల్క్యశిక్ష)

శ్లో॥ హృదయే చైకమాత్రస్స్యాదర్ధమాత్రస్తు మూర్ధని ।
నాసికాయాం తథాఽర్ధంచ రఙ్గస్యైవం
ద్విమాత్రతా ॥ 28

**అర్థ:** రఙ్గస్య - రఙ్గవర్ణమునకు; హృదయే - హృదయమున; ఏక**మాత్రః** - ఒకమాత్రాకాలమును; మూర్ధని - మూర్ధ (శిరస్సు)యందు; అర్ధమాత్రస్తు - అర్ధమాత్రాకాలమును; తథా - అదేవిధముగా; నాసికాయామ్ - ముక్కునందు; అర్ధంచ - అర్ధమాత్రయును; ఏవమ్ - ఈ విధముగ; ద్విమాత్రతా - రెండు మాత్రలుచ్చారణకాలము కలిగి యుండుటఁ (దెలియవలెనని భావము.)

**వ్యా:** హృదయమునందేకమాత్రాకాలమును, మూర్ధయందర్ధమాత్రాకాలమును, నాసికయందర్ధమాత్రాకాలమును, వెరసి రెండుమాత్రలకాలమున రఙ్గవర్ణముచ్చరింపఁబడునని భావము.

రఙ్గవర్ణమాత్రాపరిమితి

హృదయము 1 మాత్ర + మూర్ధ ½ మాత్ర + నాసిక ½ మాత్ర = 2మాత్రలు.

**అవ:** ఈ విధముగ రజ్ఞోచ్చారణకాలపరిమితిని నిర్ణయించిన పిదప లౌకికోదాహరణపూర్వకముగా తదుచ్చారణమును దెల్పుచున్నాడు:

శ్లో॥ హృదయాదుత్కరే తిష్ఠన్ కాంస్యేన సమనుస్వరన్ ।
మార్దవం చ ద్విమాత్రం చ జఘన్వాఁ ఇతి
నిదర్శనమ్ ॥ 30

**అర్థ:** హృదయాత్ - హృదయప్రదేశమునుండి; ఉత్కరే - ఊర్ధ్వప్రదేశమున (అనగా హృదయ కంఠ దేశముల నడుమ) తిష్ఠన్ - ఉంటున్నదై, (ఉచ్చరింపఁబడుచున్నదై); రజవర్ణము, కాంస్యేన - కంచుమ్రోతతో; సమనుస్వరన్ - సమానమగు ననునాదము (అనగా కంచుమ్రోతతో సమమగు స్వరము) కలదై; మార్దవం చ - మృదువుగను; ద్విమాత్రం చ - ద్విమాత్రికముగను (ఉచ్చరింపఁబడవలెనని శేషార్థము). జఘన్వాఁ ఇతి - జఘన్వాఁ అనుపదము; నిదర్శనమ్ - ఉదాహరణము.

**వ్యా:** హృదయ కంఠదేశముల మధ్యనుచ్చరింపఁబడు రజవర్ణము కంచుమ్రోతవలె నాతికఠినముగను, నాతిమృదువుగను, ద్విమాత్రాపరిమాణకముగను నుచ్చరింపఁబడవలెనని భావము. జఘన్వాఁ (2) అనునది యుదాహరణము.

**అవ:** రజ్గస్వరోచ్చారణమునందలి కమ్పములను సోదాహరణముగాఁ బ్రస్తావించుచున్నాఁడు,

శ్లో॥ మధ్యేతు కమ్పయేత్కమ్ప ముభౌపార్శ్వౌ సమౌ భవేత్ ।

సరఙ్గం కమ్పయేత్కమ్పం రథీవేతి నిదర్శనమ్ ॥ 31

**అర్థ:** ఇచట పలుకువాఁడు అను నర్థము గల 'ఉచ్చారయితా' అను పదమధ్యాహార్యము. కాఁగా నుచ్చరించెడువాఁడు; మధ్యే - స్వరోచ్చారణమధ్యకాలమునందు; కమ్పమ్ - కమ్పముగావింపవలసిన స్వరమును; కమ్పయేత్ - కంపముగానుచ్చరింపవలెను. ఉభౌ పార్శ్వౌ - స్వరముయొక్క ఆద్యన్తములు రెండును; సమౌ - సమమైనవిగా; భవేత్ - ఉండవలెను (ఉచ్చరింపఁబడవలెనని భావము). కమ్పమ్ - స్వరము (కమ్పితస్వరము); సరఙ్గమ్ - రఙ్గవర్ణముతోఁగూడ; కమ్పయేత్ - కమ్పించవలెను. రథీవేతి - 'రథీవ' యని; (అనగా 'రథీవ' అనుపదము); నిదర్శనమ్ - ఉదాహరణము.

**వ్యా:** రఙ్గవర్ణము నుచ్చరించునెడ, స్వరోచ్చారణమధ్యకాలమునందు, స్వరమును కంపింపఁజేసి యాద్యవసానముల రెండింటిని సమముగా నుండునటుల సరిచూచుకొనవలెను. అనగా నారోహణావరోహణముల ననుసరించి స్వరోచ్చారణముఁ గావింపవలయునని తెలియుచున్నది. మఱియు

నీకంపము రజవర్ణ సహితమై జరుగునట్లు గమనింపవలెనని భావము. 'రథీవ'-అను పదమునందలి రజ్గోచ్చారణమిట నుదాహృతము. అనగా నిచట రేఫముతోఁబాటు తదుత్తరవర్తి స్వరమును (అకారమును), ద్విమాత్రికముగా, సానునాసిక్యముతో, కమ్పయుక్తముగా నుచ్చరింపవలెను. 'ర్ అఁ(2)థీవ' యనురీతి నుచ్చరింపవలెనని భావము. ఈ విధమగు రజ్గోచ్చారణము నాచార్యుఁడు 'తస్త్రాఙ్' అను నుదాహరణము ద్వారా పూర్వము దెల్పియున్నాడు. దాని నిట నొకపరి స్మరించుట యుక్తము

ఈ కమ్పన ప్రకారమంతయు 'లోమశ శిక్షా' గ్రంథమున వివరింపఁబడినది.**

## సమ్యగ్వర్ణోచ్చారణ ఫలము

**అవ:** రజ్గోచ్చారణ పద్ధతిని వివరించిన పిదప వర్ణోచ్చారణ ఫలమునుఁ జూపుచున్నాడు:

---

* శ్లో॥ కేన కమ్పాతితః కమ్పః సంయోగో యేన కమ్పతే।
కిం వా కమ్ప ఇతి ప్రోక్తో యేనాఽసౌ కమ్పముచ్యతే॥

* శ్లో॥ పూర్వాజ్గేణ హతం పూర్వం పరాజ్గేణ తు ధారితమ్।
వ్యఞ్జనేన ద్విధాభిన్నః స్వరో భీతస్తు కమ్పతే।

(లోమశ శిక్ష)

శ్లో॥ ఏవం వర్ణాః ప్రయోక్తవ్యా నాఽవ్యక్తా న చ పీడితాః ।
సమ్యగ్వర్ణప్రయోగేణ బ్రహ్మలోకే మహీయతే ॥ 32

**అర్థః:** ఏవమ్ - ఈవిధముగా (అనగా పైఁజెప్పినట్లుగా); వర్ణాః - వర్ణములు; నాఽవ్యక్తాః - అవ్యక్తములు గాకుండునట్లును (స్ఫుటముగాననిభావము.); న చ పీడితాః - ఎక్కువగా నొక్కి పలుకఁబడకుండునట్లును; ప్రయోక్తవ్యాః- ప్రయోగింపఁబడవలెను; (ఇట్లు) సమ్యక్ - లెస్సగా; వర్ణప్రయోగేణ - వర్ణములఁబ్రయోగించుటచే (ఉచ్చరించుటచే) బ్రహ్మలోకే - బ్రహ్మలోకమునందు, మహీయతే - పూజింపఁబడును.

**వ్యా:** ఈయంశమే యాజ్ఞవల్క్యశిక్షాగ్రంథమున "మధురం చాపి నాఽవ్యక్తం సువ్యక్తం న చ పీడితమ్" -అని చెప్పఁబడినది.

సమ్యగ్వర్ణప్రయోగముచే బ్రహ్మపదప్రాప్తి యెట్లు సిద్ధించుననను సందియమిచట తగదు. ఏలన "ఏకశ్శబ్దస్సమ్యగ్ జ్ఞాతః సుష్ఠు ప్రయుక్తః స్వర్గే లోకే చ కామధుగ్భవతి" *యను స్మృతివాక్య మీ యుక్తిని సమర్థించుచున్నదని భాష్యకారులుగూడ వచించియున్నారు. ఈ విధముగా సుశబ్దప్రయోగము నిశ్శ్రేయసాధిగమసాధకమగుచున్నది.

---

* (శబ్దస్వరూపమునుఁ జక్కగా నెఱిఁగి తగిన యర్థమున సుందరముగఁ బ్రయోగించినచో నిలోకమునందును పరలోకమునందును శ్రేయము కలుగును).

# పాఠకలక్షణము

**అవ:** స్వరయుక్తముగా యథావిధిగా వర్ణముల నుచ్చరించినప్పటికి నవి స్పష్టముగా శ్రావ్యముగా నున్నప్పుడే పాఠకుని శ్రోతలు నుతింతురు. అట్టివాఁడు మంచి పాఠకుఁడుగా నెంచఁబడుచున్నాడు. ఎవఁడు పాఠసమయమున నహంకార పూరితుఁడై లేదా యపస్వరముతో శ్రోతలకు విసుగుజనించు విధమున పఠించునో యట్టివాఁడు పాఠకాధముఁడుగా నెంచఁ బడుచున్నాఁడు. అట్టి పాఠకాధమలక్షణముల నాచార్యుఁడిట్లు ప్రస్తావించుచున్నాఁడు:

శ్లో॥ గీతీ శీఘ్రీ శిరఃకమ్పీ తథా లిఖితపాఠకః ।
అనర్థజ్ఞోఽల్పకంఠశ్చ షడేతే పాఠకాధమాః ॥ 33

**అర్థ:** గీతీ – పాడుచున్నట్లు (కూనిరాగములు తీయుచూ) చదువువాఁడును; శీఘ్రీ – అతిత్వరితముగా (శ్రోతల కర్థముచేసికొనుటకు వ్యవధినీయక) చదువువాఁడును; శిరఃకమ్పీ – తలను వణికించుచూ చదువువాఁడును, తథా – అట్లే; లిఖితపాఠకః – వ్రాసికొన్నదానినిచదువువాడును; అనర్థజ్ఞః – అర్థముఁదెలియనివాఁడును; అల్పకంఠశ్చ – హీనస్వరముతోఁ జదువువాఁడును; (అను) ఏతే షట్ – వీర లాఱుగురును; పాఠకాధమాః – అధమపాఠకులు.

**వ్యా:** అర్థము స్పష్టము, కాఁగా లిఖితపాఠకుఁడధమ పాఠకుఁడెట్లగునను సందియమిట మనకుదయింపవచ్చును. ముఖ్యముగా నాటి వేదశాస్త్రాభ్యాససంప్రదాయముననుస రించి చెప్పిన మాట యిది. స్వరప్రధానమగు వేదము గురు ముఖతః అభ్యసింపవలసినదిగాని, పుస్తకమూలమున నభ్య సించునది కాదు. అందొక్క స్వరముగూడ దుష్టముగా నుచ్చరింపఁబడరాదు. దానివలన నర్థభేదముదయించుటయే కాక నది ప్రయోక్త పాలిట మృత్యువగును. (చూ॥ శ్లో॥52) మఱియు శాస్త్రాదికముగూడ నాడు గురుముఖతః అభ్యసించి తెలియనివన్నియు చింతన పాఠములద్వారా బుద్ధియందు స్థిర పరచుకొను సంప్రదాయముండెడిది. అర్థాదులను, వ్యాఖ్యావిష యములను మస్తిష్కముననే తప్పలిఖితరూపమున పుస్తకము లందు పొందుపరచుట నాటి యాచారముకానేకాదు. పైగా నట్టిపాఠకుని పాఠకాధమునిగా గణించెడివారు. ఈ సంప్ర దాయసూచకములగు శ్లోకములు మనకు సుభాషితాదులందు కనిపించును.*

---

* పుస్తకస్థా చ యా విద్యా పరహస్తే చ యద్ధనమ్ ।
కార్యకాలే సమాయాతే న సా విద్యా న తద్ధనమ్ ॥
పుస్తకములందు పొందుపరుపఁబడిన విద్య, యితరులవద్దనుంచిన ధన ను అక్కఱకు రావని భావము. ఈ విధముగ నాకాలమున లిఖితము పాఠకత్వము దోషముగానెన్నబడుచుండెడిది.

## పాఠకగుణములు

**అవ:** పాఠకాధములను దెలిపిన యనంతరము పాఠకగుణములం గూర్చి ప్రస్తావించు చున్నాడు.

శ్లో॥ మాధుర్య మక్షరవ్యక్తిః పదచ్ఛేదస్తు సుస్వరః ।
ధైర్యం లయసమర్థం చ షడేతే పాఠకాగుణాః ॥ 34

**అర్థ:** మాధుర్యమ్ - శ్రవణమధురముగాం జదువుట; అక్షరవ్యక్తిః - వర్ణములను సుస్పష్టముగా నుచ్చరించుట; పదచ్ఛేదః - పదములం విడమరచి చదువుట; సుస్వరః - శోభనమగు శ్రవణపేయమగు స్వరమును కలిగియుండుట; ధైర్యమ్ - (సభామధ్యమున) నిర్భయముగా చదువుట; లయ సమర్థంచ - స్వరానుగుణోచ్చారణము (అనగా శ్రవణపేయ మగు విరామమునిచ్చుట యని భావము) (అను) ఏతే - యీ; షట్ - ఆరును; పాఠకాఃగుణాః - పాఠక గుణములు.

## ఉచ్చారణదోషములు

**అవ:** ఈ విధముగ పాఠకగుణవర్ణనానన్తరము వర్ణోచ్చారణమునందలి దోషములను రెండు శ్లోకములలో నాచార్యుఁడుపబోధించుచున్నాఁడు:

శ్లో॥ శఙ్కితం భీతిముద్ఘుష్టమవ్యక్తమనునాసికమ్ ।
కాకస్వరం శిరసిగం తథా స్థాన వివర్జితమ్ ॥ 35

అర్థః శఙ్కితమ్ - సందిగ్ధమైనదిగను; భీతిమత్ - భయసంయుతమైనదిగను; ఘృష్టమ్ - ప్రకృష్టధ్వనియుక్తముగను; అవ్యక్తమ్ - అస్పష్టముగను; అనునాసికమ్ - అనునాసికముగను, (అనగా, నిరనునాసికములఁగూడ ననునాసికముగాఁ బలుకుట యని భావము.); కాకస్వరమ్ - కాకస్వరమువలెఁ (కర్ణ)కఠోరమైనదిగను; శిరసిగమ్ - మూర్ధన్యముగను [ప్రతివర్ణమును (తమిళులవలె) మూర్ధన్యముగానుచ్చరించుట]; స్థానవివర్జితమ్ - స్థానభ్రష్టముగను (అనగా నాయాస్థానములందుఁ గాక వర్ణములనితర స్థానములందుచ్చరించుట యని భావము.) న వదేత్ - పలుకరాదు. (అని తరువాతి శ్లోకమునందలి నిషేధముతో నన్వయించుకొనవలెను.)

శ్లో॥(2) ఉపాంశుదష్టం త్వరితం నిరస్తం
విలమ్బితం గద్గదితం ప్రగీతమ్ ।
నిష్పీడితం గ్రస్తపదాక్షరం చ
వదేన్న దీనం న తు సానునాస్యమ్ ॥ 35

అర్థః ఉపాంశుదష్టమ్ - నోటిలోనసములుచున్నట్లును; త్వరితమ్ - శీఘ్రముగను; నిరస్తమ్ - అతినిష్ఠురముగను; విలమ్బితమ్ - ఆలస్యముగను (ఆసక్తివిహీనముగను); గద్గదితమ్ - గద్గదస్వరయుక్తముగను; ప్రగీతమ్ - పాడునట్లుగను; నిష్పీడితమ్ - బాగుగనొక్కబడినట్లును; గ్రస్తపదాక్షరమ్ -

కొన్నివర్ణములు లేక పదములు మ్రింగబడునట్లును (అనగా వదలియుచ్చరించుటయని భావము); దీనమ్ - ఉత్సాహవిహీనమగు స్వరముతోను; సానునాస్యమ్ - ముక్కుతో పలుకఁబడునవిగను; న వదేత్ - ఉచ్చరింపరాదు.

**అవ:** ఇచట 'న దీనమ్', 'న తు సానునాస్యమ్' అని రెండుచోట్ల 'నఞ్' ప్రయోగము కనిపించుచున్నది. 'ద్విర్బద్ధం సుబద్ధం భవతి' అను న్యాయముననుసరించి యాచార్యుఁడు నిషేధదార్ఢ్యముకొఱకై నఞ్ ద్వయప్రయోగము నొనరించెనని గ్రహింపఁదగినది. ఇంకను, ననునాసికముగా నుచ్చరింపరాదని పూర్వతన శ్లోకమునఁజెప్పినదానినే మరల నీశ్లోకమునందు 'న తు సానునాస్యమ్' అని నిషేధించుట పునరుక్తముగా కనిపించును. అదియును నిషేధదార్ఢ్యము కొరకని సమన్వయించుకొనినచో నదిదోషము కానేరదు. ఇట్లే మిగిలిన పునరుక్తులనుఁ గూడ సమన్వయించుకొనవలసి యున్నది.

## త్రిసంధ్యలయందునుచ్చారణము

**అవ:** వర్ణోచ్చారణవిషయమున గుణదోషముః వివరించిన యనన్తరమాచార్యుఁడు కాలత్రయమునందుః వర్ణోచ్చారణమును రెండు శ్లోకములలో తెలుపుచున్నాడుః

శ్లో॥ ప్రాతః పఠేన్నిత్యమురః స్థితేన
స్వరేణ శార్దూలరుతోపమేన ।
మధ్యన్దినే కణ్ఠగతేన చైవ
చక్రాహ్వ సంకూజిత సన్నిభేన ॥ 36

**అర్థ:** ప్రాతః ప్రాతఃకాలమునందు; ఉరఃస్థితేన - హృదయమునందున్న (హృదయమునుండి యుద్భవించిన); శార్దూలరుతోపమేన - పెద్దపులి గాండ్రింపుతో పోల్చదగు- స్వరేణ - స్వరముతో; పఠేత్ - చదువవలెను. మధ్యందినే; మధ్యాహ్నసమయమున; చక్రాహ్వాసంకూజిత సన్నిభేన - చక్రవాకపక్షి యొక్క కలకూజితమును బోలిన; కంఠగతేన స్వరేణ - కంఠమును బొందినస్వరముతో (అనగా కంఠ్యములుగా వర్ణములను), పఠేత్ - చదువవలెను.

**అవ:** ప్రాతర్మాధ్యాదిహ్నికసవనమునందలి వర్ణో చ్చారణమును సోదాహరణముగాఁ దెలిపిన పిదప సాయం సవనమన్త్రవర్ణపఠనమును వివరించుచున్నాఁడు:

శ్లో॥ తారం తు విద్యాత్సవనం తృతీయం
శిరోగతం తచ్చ సదా ప్రయోజ్యమ్ ।
మయూరహంసాన్యభృతస్వరాణాం
తుల్యేన నాదేన శిరఃస్థితేన ॥ 37

**అర్థ** తృతీయమ్ - మూడవదైన; సవనమ్ - సాయంసవనమన్త్రమును, తారమ్ - ఉచ్చైస్స్వరముతో; మయూరహంసాన్యభృతస్వరాణాం - నెమళ్ళయొక్కయు, హంసలయొక్కయు, కోయిలలయొక్కయు, స్వరములతోకూడి; నాదేన - స్వరముతో; పఠేత్ - చదువవలెను; తచ్చ - ఆ నాదము లేక యుచ్చారణమును: సదా - ఎల్లప్పుడును; శిరోగతమ్ - తలనుండి ప్రయోగింపఁబడినదిగా; విద్యాత్ - తెలిసికొనవలెను.

**వ్యా:** అనగా ప్రాతఃకాలమున హృదయస్థానికమగు శార్దూలగర్జనమునుఁబోలిన స్వరముతోను; మధ్యాహ్నమున చక్రవాకకూజితసమానమగుకంఠగత స్వరముతోను; యిట్లే సాయంకాలమున, మయూర-హంస-పికస్వరానుకారియగు శిరఃస్థస్వరముతోను; వర్ణములనుచ్చరింపవలెనని భావము.

## ప్రయత్న నిర్ణయము

**అవ:** వర్ణోచ్చారణస్థానములను, స్వరములను నిర్ణయించిన పిదప ప్రకరణానుసారముగా వాని ప్రయత్నములఁ గూడ నిర్ణయింప నుపక్రమించి, తొలుత క్రమముననుసరించి యాచార్యుడాభ్యన్తర ప్రయత్నముల వివరించుచున్నాడు:

శ్లో॥ అచోఽస్పృష్టా యణస్త్వీషన్నేమస్పృష్టాః శలః స్మృతాః ।
శేషాః స్పృష్టా హలః ప్రోక్తా నిబోధానుప్రదానతః ॥38

**అర్థ** అచః - అజ్వర్ణములు, అస్పృష్టాః - స్పర్శములుకానివి. (అనగా వివృతత్వము కలవని భావము). యణస్తు - యణ్ ప్రత్యాహారవర్ణములు (య,వ,ర,లలైతే), ఈషత్ - కొలది స్పర్శప్రయత్నము కలవి. శలః - శల్ప్రత్యాహారవర్ణములు (శ,ష,స,హలు), నేమస్పృష్టాః - సగము స్పర్శప్రయత్నముకలవని; స్మృతాః - చెప్పబడినవి. శేషః- మిగిలిన, హలః - హల్ ప్రత్యాహారవర్ణములు, అనుప్రదానతః - బాహ్యప్రయత్నములననుసరించి, స్పృష్టాః - స్పర్శప్రయత్నము కలవిగా; ప్రోక్తాః - చెప్పబడినవి.

**వ్యా:** అచ్చులు, కేవల వివారప్రయత్నముకలవనియు, 'యణ్'లు కొలది స్పర్శప్రయత్నము, కొలది వివృత ప్రయత్నము కలవనియు. 'శర్'లు సగభాగము స్పర్శప్రయత్నము, మిగిలిన సగభాగము (యణ్లకన్న ఎక్కువగా) వివృత ప్రయత్నము కలవి గను చెప్పబడినవి. ఇవిగాక మిగిలిన హల్లులు బాహ్యప్రయత్నముననుసరించి స్పర్శప్రయత్నము కలవని భావము.

**ఆవ:** కాగా ప్రకరణము ననుసరించి బాహ్యప్ర-

యత్నమూలమున నుచ్చరింపఁబడు వర్ణములను ప్రస్తావించు చున్నాఁడు.

శ్లో॥ ఞమోఽనునాసికా నహ్రౌ నాదినో హఝషః స్మృతాః।
ఈషన్నాదా యణజశః శ్వాసినస్తు ఖఫాదయః॥ 39
ఈషచ్ఛ్వాసాంశ్చరో విద్యాత్ ...

**అర్థ:** ఞమః - ఞమ ప్రత్యాహారాన్తర్గతములగు వర్గపఞ్చమాక్షరములు (ఙ,ఞ,ణ,న,మఅనునవి), అనునాసికాః - నోటితోను, ముక్కుతోనుగూడ నుచ్చరింపఁబడునవి. (అనగా నాయా స్థానములతో పాటుగా ముక్కుతో పలుకఁబడునవి యని యర్థము) హ్రౌ - హకార రేఫములు న - అనునాసికములు కావు. హ,ఝషాః = హకార_ఝకార_షకారములు, నాదినః - నాదాఖ్యప్రయత్నము కలవి. (నాదమనగా ఘోషప్రయత్నమునకుపలక్షణము). యణః - యణ్‌లు (య,వ,ర,ల,ఌ), జశః - జశ్ ప్రత్యాహారాన్తర్గతవర్ణములు (జ,బ,గ,డ,ద అనునవి); ఈషన్నాదాః-కొలదిగా నాదప్రయత్నము కలవి. ఖఫాదయః-ఖ,ఫ మొదలగు వర్గీయ ద్వితీయాక్షరములు, శ్వాసినః - శ్వాసాఖ్య ప్రయత్నముకలవిగను, చరః - 'చర్' ప్రత్యాహారాన్తర్గతవర్ణములు, (అనగా - వర్గప్రథమాక్షరములు మరియు శ,ష,స, వర్ణములను), ఈషచ్ఛ్వాసాన్ - కొలది శ్వాసప్రయత్నముకలవిగను, విద్యాత్ - తెలిసికొనవలెను.

**వ్యా:** ఉక్తశ్లోకమున 'యణః జశః' అనుటకుఁ బదులు, 'యణాశ్చైవ' అను పాఠాన్తరము కానవచ్చుచున్నది ఈపాఠము శేఖరకారునకు సమ్మతమైనట్లు ప్రదీపవ్యాఖ్యానము చెప్పుచున్నది. పై విభాగము ననుసరించి యనునాసికోచ్చారణము బాహ్యప్రయత్నముగాఁ జూపట్టుచున్నది. సిద్ధాన్తకౌముదిలో చూపబడినంత వివరముగా నిందు బాహ్యప్రయత్నమునందలి ఏకాదశ విభాగములు చూపఁబడలేదు. భట్టోజీ దీక్షితులీ ప్రణాళికను విస్తరించినాఁడని చెప్పవచ్చును. పరికింపగా ప్రయత్నవిభాగ మీరీతిని గోచరించును.




సిద్ధాన్తకౌముద్యనుసారముగ ప్రయత్నవిభాగమునిట్లు చూపవచ్చును.

## ప్రయత్నము

**అభ్యన్తరప్రయత్నములు**

- స్పృష్టము
- ఈషత్స్పృష్టము
- వంవృతము
- వివృతము

**బాహ్యప్రయత్నములు**

1. వివారము
2. సంవారము
3. శ్వాసము
4. నాదము
5. ఘోషము
6. అఘోషము
7. అల్పప్రాణము
8. మహాప్రాణము
9. ఉదాత్తము
10. అనుదాత్తము
11. స్వరితము.

సిద్ధాన్తకౌముదీకర్త తెల్పిన యీ విభాగము కడు వైజ్ఞానికముగ, విశదముగా నున్నది.

## స్వీయశాస్త్రప్రశంస

అవ: వర్ణోచ్చారణవిధులఁ దెలిపిన యనన్తరమాచార్యుఁడు 'ప్రయోజన మనుద్దిశ్య న మన్దోఽపి ప్రవర్తతే'

నట్టి ఫలమును లేకుండ నవివేకి కూడ నేకార్యమందును బూరంబడఁడు.) యను సూక్తిననుసరించి తన శాస్త్రప్రాము ఖ్యమును మాహాత్మ్యమును ప్రస్తావించుచున్నాఁడు. ఈ మాహాత్మ్యప్రవచనము ద్వారమున నేతచ్ఛాస్త్రాభ్యాసమున పాఠకులను ప్రవర్తింపచేయుట యాచార్యుని యాశయముగాఁ దోచును:

శ్లో॥ ......... గోధ్రామైతత్ప్రచక్షతే ।
దాక్షీపుత్రపాణినినా యేనేదం వ్యాపితం భువి ॥ 40

**అర్థ:** ఈ శ్లోకప్రథమపాదము పూర్వశ్లోకమున వ్యాఖ్యాతము. యేన-ఏ; దాక్షీపుత్రపాణినినా-దాక్షీపుత్రుఁడగు పాణినిచే; ఇదమ్-ఈ వ్యాకరణశాస్త్రము; భువి-భూమియందు; వ్యాపితమ్-వ్యాపింపఁజేయఁబడినదో; ఏతత్-దీనిని; గోధ్రామ-వాక్కులకు నిలయమని (శబ్దములకు నిలయమని); ప్రచక్షతే-(తజ్ఞులగు విజ్ఞులు) చెప్పుచున్నారు.

## వేదాఙ్గవివేచనము

**అవ:** ఆచార్యుఁడు తన శాస్త్రమును వేదాఙ్గము లలో నొకటిగాఁ దెల్పుచు సాఙ్గవేదాధ్యయనఫలము నెఱిం గించుచున్నాఁడు:-

శ్లో॥ ఛన్దః పాదౌ తు వేదస్య హస్తౌ కల్పోఽథ పఠ్యతే ।
జ్యోతిషామయనం చక్షుః నిరుక్తం శ్రోత్రముచ్యతే ॥ 41

శ్లో॥ శిక్షా ఘ్రాణంతు వేదస్య ముఖం వ్యాకరణం స్మృతమ్‌।
తస్మాత్సాఙ్గమధీత్యైవ బ్రహ్మలోకే మహీయతే । 42

అర్థ॥ వేదస్య - వేదమునకు (వేదపురుషునకు); ఛన్దః - (పిఙ్గళకృతమగు) ఛన్దశ్శాస్త్రము; పాదౌ - పాద ద్వంద్వముగను; అథ - పిమ్మట; హస్తౌ - బాహుయుగళము గా; కల్పః - కల్పసూత్రము; పఠ్యతే - (చదువ) చెప్పఁబడు చున్నది. జ్యోతిషామయనమ్‌- (లగధగర్గాదిముని ప్రణీతమగు) జ్యోతిశ్శాస్త్రము; చక్షుః - కన్నుగను; నిరుక్తమ్‌ - (యాస్కాచార్యప్రణీతమగు) నిరుక్తము, (నిరుక్తమనగా వేద మన్త్రార్థసమ్యక్పరిజ్ఞానార్థము రచింపఁబడిన వైదికపదకోశ ము); శ్రోత్రమ్‌ - చెవిగను; ఉచ్యతే - చెప్పఁబడుచున్నది. శిక్షాతు - ప్రకృతములగు శిక్షాగ్రంథములైతే; ఘ్రాణమ్‌ - ముక్కు (ఘ్రాణేంద్రియము) గను; (స్మృతమ్‌ - చెప్పఁ బడినది). ముఖమ్‌ - ముఖముగా, వ్యాకరణమ్‌ - (పాణిన్యాదిప్రణీతమగు) వ్యాకరణశాస్త్రము; స్మృతమ్‌ - చెప్పఁ బడినది. తస్మాత్‌ - ఆకారణమువలన; సాఙ్గమ్‌ - ఉక్తాఙ్గ సమేతముగా; అధీత్యైవ - అభ్యసించినప్పుడే (అభ్యసించిన వాఁడు మాత్రమే); బ్రహ్మలోకే - బ్రహ్మలోకమునందు; మహీయతే - పూజింపఁబడుచున్నాఁడు.

వ్యా॥ సాఙ్గోపాఙ్గముగా వేదాధ్యయనముఁ గావిం చినవాఁడే బ్రహ్మలోకమున పూజార్హుఁడని చెప్పటలో నాయా

యజ్ఞముల యధ్యయనావశ్యకత వ్యక్తమగుచున్నది.

'ముఖమివ ముఖ్యమ్' అనగా ముఖమువలె ప్రధానమగు వ్యాకరణ శాస్త్రమును, (వ్యాకరణమును), మఱియు పరిష్కృతంబగు శిక్షా శాస్త్రమును, చివర పేర్కొనుటలో నాచార్యుని యవికత్థనత్వము, నిరాడంబరత, శాస్త్రాన్తరముల యెడ గౌరవము వ్యక్తమగుచున్నవి.

ఇచట చర్చనీయాంశ మొండు గలదు. "యద్యత్సావయవం తత్తదనిత్యమ్" అనగా నవయవములుగ్గల ప్రతివస్తువు నశించుననను సామాన్యవ్యాప్తి ననుసరించి షడఙ్గయుక్తమగుటఁ జేసి వేదముగూడ ననిత్యమే యగునని కొందఱు పూర్వపక్షము గావించిరి. కాని యదంత సముచితముగా దూపట్టదు. పై శ్లోకమున వేదమునకు మూర్తిత్వము కల్పించబడినదని కొందరి సిద్ధాన్తము. అట్లుగాక మఱికొందరు మన్త్రద్రష్టలగు పాణిన్యాది మహర్షులు నిత్యతత్త్వములను దర్శించి తత్ప్రతిపాదక శాస్త్రములను వెలయించిరన్నియు, నిత్యతత్త్వప్రతిపాదకములగుటఁ జేసి యవియును నిత్యములే యనియు సిద్ధాన్తీకరించిరి. అయినచో నాపక్షమున ననగా నఙ్గిత్వమునకు నిత్యత్వము నంగీకరించిన పక్షమున భూతములగు శాస్త్రాదులకు నిత్యత్వ మెట్లు సాధ్యమగునని ముక్తవ్యాప్తి ననుసరించి వాని కఙ్గత్వమెట్లు సాధ్యమగునని మరల పూర్వపక్షముపస్థితమగును. దానికి సమాధానముగా నీవిషయము మరల పూర్వపక్షముపస్థితమగును. జెప్పుకొనవలెను. ఈవిషయ నఙ్గిత్వమిచట నుపలక్షణముగాఁ జెప్పుకొనవలెను.

ములు శాస్త్రీయ ప్రక్రియానుసారము పూర్వపక్ష, సిద్ధాన్త సరణిలో లఘుమఞ్జూషాది గ్రంథము లందు చర్చింపఁబడినవి.

ఛందశ్శాస్త్రాదులకు వేదాఙ్గత్వము ననేకులగు శాస్త్రకారులంగీకరించినట్లు కన్పించుచున్నది. వాచస్పతిమిశ్రులుకూడ

శ్లో॥ షడ్భిరఙ్గైరుపేతాయ వివిధైరవ్యయైరపి ।
శాశ్వతాయనమస్కుర్మో వేదాయ చ
భవాయ చ ॥ అని

వేదమును సాఙ్గముగా నుతించిరి. ఇట్టి సాఙ్గవేదాధ్యయనము వలన బ్రహ్మలోకము సిద్ధించుననని యాచార్యుఁడు వచించుచున్నాఁడు. ఇచట స్వశాఖాధ్యయనమును షడఙ్గయుతముగా గావింపవలెనని యాతని హృదయముగాఁ దోచును. ఏలన సంపూర్ణవేదాధ్యయనము మానవునకు శక్యముకాని పని. మరియు నదియే యాతని యుద్దేశ్యమైనచో వివిధ శిక్షాద్యఙ్గ గ్రంథములకు వైయర్థ్యము గూడ వాటిల్లునవకాశము కలదు. కావున నిచట సాఙ్గోపాఙ్గముగా స్వశాఖాధ్యయనమే బ్రాహ్మణుని యవశ్యకర్తవ్యమని యాచార్యుని హృదయముగా తెలియఁదగినది.

---

# హస్తస్వరక్రమము

అవ: వేదాధ్యయనముయొక్కయు, వేదాంగములైన స్వీయశిక్షావ్యాకరణములయొక్కయు, మాహాత్మ్య

ప్రయోజనముల నుపవర్ణించిన పిదప ప్రత్యేకముగా సామవేదమున స్వరనిర్దేశప్రకారమునుఁ దెలుపుచున్నారు:

శ్లో॥ ఉదాత్తమాఖ్యాతి వృషోఙ్గుళీనాం
ప్రదేశినీ మూలనివిష్టమూర్ధా ।
ఉపాన్తమధ్యే స్వరితం ద్రుతఞ్చ
కనిష్ఠికాయా మనుదాత్తమేవ ॥ 43

**అర్థ:** అఙ్గుళీనామ్ - వ్రేళ్ళలో; వృషః - శ్రేష్ఠమైనదగు నంగుష్ఠము (బొటనవ్రేలు); ప్రదేశినీమూలనివిష్టమూర్ధా - చూపుడువ్రేలి మొదట నుంచబడిన యగ్రభాగము కలదై; ఉదాత్తమ్ - ఉదాత్తస్వరమును; ఆఖ్యాతి - చెప్పుచున్నది; (అటులనే నా యంగుష్ఠము) ఉపాన్తమధ్యే - అనామికా మధ్యాఙ్గుళులయందు; నివిష్టమూర్ధా - ఉంచబడిన యగ్రముకలదై; స్వరితం - స్వరితస్వరమును; ద్రుతఞ్చ - ద్రుతస్వరమును; ఆఖ్యాతి - చెప్పుచున్నది. కనిష్ఠికాయామ్ - చిటికెన వ్రేలియందు; అనుదాత్తమేవ - అనుదాత్తస్వరమునే; ఆఖ్యాతి - చెప్పుచున్నది.

**వ్యా:** అనగా నుదాత్తస్వరము నుచ్చరించునప్పుడు బొటనవ్రేలి చివరను చూపుడువ్రేలి మొదటిభాగముపైనను, స్వరితము నుచ్చరించునపుడనామికా మూలభాగము పైనను, ద్రుతస్వరము నుచ్చరించునెడ మధ్యవ్రేలి మొదటి భాగముపైనను, అనుదాత్తస్వరోచ్చారణమునందు కనిష్ఠికాధిష్ఠితముగను నుంచి యా యా స్వరముల నుచ్చరింపవలెనని భావము.

**అవ:** ఈ విషయమున నే మరల ధృవీకరించు చున్నాడు.

శ్లో॥ ఉదాత్తం ప్రదేశినీం విద్యాత్ ప్రచయం
మధ్యతో౽ఙ్గులిమ్ ।
నిహతం తు కనిష్ఠికాయాం స్వరితోపకనిష్ఠికామ్ ॥ 44

**అర్థ:** ఉదాత్తమ్ - ఉదాత్తస్వరమును; ప్రదేశినీం - ప్రదేశినికి (అనగా చూపుడు వ్రేలికి) సాధ్యమైనదానిగా; విద్యాత్ - తెలిసికొనవలెను; ప్రచయమ్ - ప్రచితస్వరమును; మధ్యతో౽ఙ్గులిమ్ - మధ్యమాఙ్గుళీ సాధ్యముగను; నిహతంతు - అనుదాత్తమునైతే; కనిష్ఠికాయామ్ - చిటికెన వ్రేలికి సాధ్యమైనదిగను; స్వరితమ్ - స్వరితస్వరమును; ఉపకనిష్ఠికామ్ - కనిష్ఠికాసమీపవర్త్యనామికాసాధ్యముగను; విద్యాత్ - తెలిసికొనవలెను.

**వ్యా:** పునరుక్తి దృఢీకరణము కొఱకని సమర్థించిన సమర్థింపవచ్చును. లేదా ప్రక్షిప్తమనియైనను భావించవచ్చును.

---

## పదశయ్యావిభాగము

**అవ:** పదోచ్చారణ విషయమున నవవిధములగు శయ్యాప్రకారముల నాచార్యుడు సోదాహరణముగ వివరించుచున్నాడు;

శ్లో॥ అన్తోదాత్త మాద్యుదాత్త మనుదాత్తం నీచస్వరితమ్ ।
మధ్యోదాత్తం స్వరితం ద్వ్యుదాత్తం త్ర్యుదాత్తమితి
నవపదశయ్యా ॥ 45

**అర్థ:** 1. అన్తోదాత్తము 2. ఆద్యుదాత్తము 3. అనుదాత్తము 4. నీచస్వరితము 5. మధ్యోదాత్తము 6. స్వరితము 7. ద్వ్యుదాత్తము 8. త్ర్యుదాత్తము 9. ఉదాత్తము అని పదశయ్య తొమ్మిది విధములని భావము.

**వ్యా:** ఈ శ్లోకమునకు ప్రతిపదార్థముకన్న భావమే స్పష్టార్థముఁగూర్చును. శ్లోకమున పదశయ్య నవవిధములని చెప్పుచూ నెనిమిదింటినే పరిగణించుటచే మిగిలినదానినుదాత్త సామాన్యముగా నెఱుగవలసియున్నది. ఏలన నుదాహరణ ప్రదర్శనావసరమున 'ప్రేత్యుదాత్తం' అని ఉదాత్తమున నుదాహరణముగాఁ బ్రస్తావించెను.

## ఉ దా హ ర ణ ము లు

పైఁ జెప్పఁబడిన నవవిధ శయ్యాప్రకారములకు క్రమముగా వైదికోదాహరణములఁ జూపుచున్నాడు:

"అగ్నిః సోమః ప్రవోవీర్యం హవిషాం స్వర్బృహస్పతి
రిన్ద్రాబృహస్పతీ" ఇతి ।

ఈ యుదాహరణమున—

శ్లో॥ అగ్నిరిత్యన్తోదాత్తం సోమ ఇత్యాద్యుదాత్తమ్ ।
ప్రేత్యుదాత్తం వ ఇత్యనుదాత్తం వీర్యం
నీచస్వరితమ్ ॥ 46

హవిషాంమధ్యోదాత్తం స్వరితి స్వరితమ్ ।
బృహస్పతిరితి ద్వ్యుదాత్త మిన్ద్రాబృహస్పతీ ఇతి
త్ర్యుదాత్తమ్ ॥ 47

**వ్యా:** దీనికిఁగూడ ప్రతిపదార్థ మవసరము లేదు. ఉదాహరణపాదము నందలి తొమ్మిది పదములు యథాక్రమముగ నవవిధ శయ్యాప్రకారములఁ దెలియఁజేయుచున్నవని యీ శ్లోకద్వయము చెప్పుచున్నది. 1) 'అగ్నిః' యనునదన్తోదాత్తమునకుదాహరణమనియు; 2) 'సోమః' యనున దాద్యుదాత్తమునకుదాహరణమనియు; 3) 'ప్ర' యనున దుదాత్తోదాహరణ మనియు; 4) 'వ' యనున దనుదాత్తోదాహరణమనియు; 5) 'వీర్యమ్' అనునది నీచస్వరితమునకుదాహరణమనియు; 6) 'హవిషామ్' అనునది మధ్యోదాత్తమునకుదాహరణమనియు; 7) 'స్వః' యనునది స్వరితమునకుదాహరణమనియు; 8) 'బృహస్పతి' యనునది ద్వ్యుదాత్తోదాహరణమనియు; 9) 'ఇన్ద్రాబృహస్పతీ' యనునది త్ర్యుదాత్తోదాహరణమనియు భావము.

ఈ విధముగా ఛన్దోబద్ధముగా క్రమముఁ దప్పక యుదాహరణ విన్యాసము గావించుటలో నాచార్యుని ప్రతిభ యెంతయుఁ బ్రశంసనీయమై యున్నది.

# హస్తస్వరక్రమము

**అవ:** వర్ణోచ్చారణకాలమునందు హస్తప్రక్షేపణ విధులఁ దెలుపుచున్నాఁడు. (ఈ విధమైన హస్తవిన్యాసములీ నాటికిని వ్యవహారమునందున్నవి.)

శ్లో॥ అనుదాత్తో హృది జ్ఞేయో మూర్ధ్న్యుదాత్త ఉదాహృతః ।
స్వరితః కర్ణమూలీయః సర్వాస్యే ప్రచయః స్మృతః ॥ 48

**అర్థ:** హృది - హృదయప్రదేశమునందు (చేతి నుంచి); అనుదాత్తః - అనుదాత్తస్వరము (పలుకఁబడవలసినదిగా); జ్ఞేయః - తెలియఁదగినది; మూర్ధ్ని - శిరస్థ్రప్రదేశమునకరమునుంచి; ఉదాత్తః - ఉదాత్తస్వరము; ఉదాహృతః - (ఉచ్చారణకై) యుదాహరింపఁ బడినది; స్వరితః - స్వరిత స్వరము; కర్ణమూలీయః - కర్ణమూలము (చెవిమొదట) చేతినుంచి యుచ్చరింపఁదగినది; సర్వాస్యే - ముఖప్రదేశమునం దంతట చేయినుంచి; ప్రచయః - ప్రచయస్వరము;* స్మృతః-

---

* The '*Prachaya*' - only the transition between a preceding 'Swarita' and the pause or a following 'Anudatta'.

Hymns from Regveda.
(Peterson - Appendix III page LXXI.) P.T.O.)

ఉచ్చరింపవలసినదిగా చెప్పఁబడినదని భావము. ప్రచయ లక్షణము పరాఙ్క శిక్షయందీవిధముగా చెప్పఁబడినది.

శ్లో॥ ఉదాత్తాన్నిహతః స్వారః స్వరితాత్ప్రచయో భవేత్ ।
ఉదాత్త స్వరితాత్పూర్వో న్యాయ ఆపద్యతే స్వరః ॥

---

## శకున్త స్వర పరిశీలనము

**అవ:** ఆచార్యుని ప్రకృతిపరిశీలన మెంతయు శ్లాఘ్యమైనది. పక్షులు మనకన్న చక్కఁగా స్వరోచ్చారణ మును నియతముగా (నియత కాలములో) గావించుననియు, నేతాదృశ స్వరోచ్చారణమును వానినుండి గ్రహింపవలెనను నుద్దేశముతో వాని నాచార్యుడిట్లని యుదాహరించుచున్నాడు:

శ్లో॥ చాషస్తు వదతే మాత్రాం ద్విమాత్రం చైవ వాయసః ।
శిఖీ రౌతి త్రిమాత్రం తు నకులస్త్వర్ధమాత్రకమ్ ॥ 49

**అర్థ:** చాషస్తు - పాలపిట్ట; మాత్రామ్ - మాత్రాపరిమాణములో; వదతే - (కికీయని) యరచును. వాయసః - కాకి; ద్విమాత్రం చైవ - ('కా2 కా2' యని) ద్విమాత్రోచ్చారణము గావించును; శిఖీ - నెమలి;

---

ఉదాత్తానుదాత్తముల సమాహారమే స్వరితము. ప్రచయమనునది స్వరిత ప్రభేదము. స్వరితము తరువాత పరామముగాని అనుదాత్తముగాని ఉన్న పుడు ప్రచయము వినిపించును. వాస్తవమున స్వరితప్రచయములకు భేద మిదమిత్థమని చెప్పుట కష్టము. (65వ పేజీ చూడుము)

త్రిమాత్రమ్ - మూడుమాత్రల పరిమాణములో; రౌతి - కేకారవమాచరించును. నకులస్తు - ముంగిస అయితే; అర్థ మాత్రకమ్ - అల్పమగు నర్థమాత్రాపరిమాణ కాలములో నరచును.

**వ్యా:** ఇచ్చట 'వదతే' - యని యాత్మనే పదప్రయోగము ఛాన్దసముగా నెఱుంగునది. 'వదతే' యనునదుచ్చారయితకొరకని యర్థమును వివక్షించినట్లగుపడును. గాన నుచ్చారయిత, మాత్రికస్వరమును పాలపిట్టనుండియు, ద్విమాత్రికస్వరమును కాకమునుండియు, త్రైమాత్రికస్వరమును నెమలినుండియు వర్థమాత్రికస్వరమును నకులమునుండియు గ్రహింపవలెనను నర్థమవగతమగుచున్నది. ఈ పద్ధతినాచార్యుఁడు దాస్వయముగా ననుసరించెను. కావుననే యాతడు "ఊకాలోఽజ్ఝ్రస్వదీర్ఘప్లుతః" (1-1-27) యని సూత్రీకరించెను. 'ప్రథమాతిక్రమణే కారణాభావాత్' అను న్యాయమునను సరించి* "అకాలోఽజ్ఝ్రస్వదీర్ఘప్లుతః" యని సూత్రీకరింపవలసియుండగా ప్రాతఃకాలీనమగు "కొక్కో(2) కో(3)..." అను కుక్కుట స్వరానుసారముగా హ్రస్వదీర్ఘప్లుతస్వరయుక్తముగా నూకాలమునే వచియించెను. ప్రకృతి నవగతము గావించుకొనుటయే గదా విజ్ఞానము!. (Understanding

---

* వర్ణసమామ్నాయమున మొదటివర్ణము అకారము దానిని విడిచి ఉకారము మ గ్రహించుటలో నొకవిశేషమున్నదని భావము.

the universe is science) ఇట్టి వైజ్ఞానిక పరిశీలనము, వైజ్ఞానిక గ్రంథములతోడి సిద్ధాన్తములఁ బ్రతిపాదించుటచే పాణినీయవ్యాకరణము జగద్విఖ్యాతి నందినది.

## సంప్రదాయవిరుద్ధాధ్యయనము నిష్ఫలము

**అవ:** వేదాధ్యయనము, శిష్టాచారసంపన్నుఁడును, స్వరపరిజ్ఞానముఁ దెలిసిన వాఁడునునగు నాచార్యునికడనే వినవలెను. లేనిచో నా వేదాధ్యయనము నిష్ఫలమని సూచించుచున్నాడు:

శ్లో॥ కుతీర్థాదాగతం దగ్ధమపవర్ణం చ భక్షితమ్ ।
న తస్య పాఠే మోక్షోఽస్తి పాపాహేరివ కిల్బిషాత్ ॥ 50

**అర్థ:** కుతీర్థాత్ - ఆచార, సంప్రదాయవిహీనుఁడగు గురువునుండి; ఆగతమ్ - వచ్చిన (అభ్యసింపఁబడిన వేదము); దగ్ధమ్ - దహింపబడినదై (రసవిహీనమై); అపవర్ణమ్ - క్లిష్టాక్షరగతికల్గినదై (సాగదీయబడిన లేదా యపస్వరయుక్తమైనదియు); భక్షితమ్ - భక్షింపబడినదియు (కొన్నిపదములు లేదా స్వరములు మ్రింగివేయబడినదియు) అగు యే వేదాభ్యాసము కలదో, తస్యపాఠే - దానియొక్క పాఠమునందు; పాపాహేరివ - దుష్టసర్పమునుండివలె; కిల్బిషాత్ - పాపము నుండి; మోక్షః - మోక్షప్రాప్తి (అర్హతకు) నాస్తి - ఉండదని భావము.

# సంప్రదాయసిద్ధాధ్యయనము సఫలము

**అవ:** వేదము శిష్టాచారసంపన్నుఁడగు గురువునొద్ద నభ్యసింపఁబడినదై నిశ్శ్రేయసాధిగమహేతువగుచున్నది.

శ్లో॥ సుతీర్థాదాగతం వ్యక్తం స్వామ్నాయ్యం సువ్యవస్థితమ్ ।
సుస్వరేణ, సువక్త్రేణ ప్రయుక్తం బ్రహ్మ రాజతే ॥ 51

**అర్థ:** సుతీర్థాదితి - సద్గురువువలన (శిష్టాచార సంపన్నుఁడైన గురువునుండియని యర్థము.); ఆగతమ్ - వచ్చినదియు (అనగా నభ్యసింపఁబడినదని భావము); వ్యక్తమ్ - స్పష్టముగనుచ్చరింపఁబడినదై; స్వామ్నాయ్యమ్ - స్వశాఖీయమై; (సంప్రదాయానుసారమభ్యసింపబడినట్టియు); సువ్యవస్థితమ్ - సుశిక్షితమై (స్వరోచ్చారణ హస్తప్రక్షేపాది విషయములందని భావము); సుస్వరేణ - ఆయామాత్రాకాలములనతిక్రమింపక నుచ్చరింపఁబడినయుదాత్తాది స్వరములతోః; సువక్త్రేణ - తత్తదుచ్చారణస్థానములచే; ప్రయుక్తమ్ - ఉచ్చరింపఁబడిన బ్రహ్మ - వేదము; రాజతే - శోభించును.

**వ్యా:** శిష్టాచారసంపన్నుఁడగు గురువునొద్ద సంప్రదాయసిద్ధముగ నభ్యసింపఁబడిన వేదము, సూచ్చారితమగుటచే, నిశ్శ్రేయసప్రాప్తి హేతువగుచున్నదని భావము.

# స్వరముల దుష్టోచ్చారణము హానికరము.

**అవ:** వర్ణోచ్చారణవిషయమున స్వరమునకు హెచ్చు ప్రాధాన్యమీయఁబడినది. సాధుశబ్దప్రయోగము వలన నేవిధముగా స్వర్గము ప్రాప్తించునో, యదేవిధముగా దుష్టశబ్దప్రయోగము నరకప్రాప్తికి కారణమగుచున్నది. ఇక శబ్దము నపస్వరముతో నుచ్చరించినచో నది ప్రయోక్తకు హానినిఁగూడ కలిగించును. గాన తన్నివృత్త్యర్థమై యపశబ్ద ప్రయోగముచే (ననగా నపస్వరోచ్చారణముచే) నాశము నందిన త్వష్ట (విశ్వకర్మ) యొక్క గాథ నుదాహరించుచు నాచార్యుఁడిట్లు వచించుచున్నాఁడు:

శ్లో॥ మన్త్రో హీనః స్వరతో వర్ణతో వా
మిథ్యాప్రయుక్తో న తమర్థమాహ।
సవాగ్వజ్రో యజమానం హినస్తి
యథేన్ద్రశత్రుస్స్వరతోఽపరాధాత్॥ 52

**అర్థ:** స్వరతః - స్వరమువలననగాని; వర్ణతో వా - వర్ణములచేగాని; హీనః - రహితమైన; మన్త్రః - మన్త్రము, మిథ్యాప్రయుక్తః - దుష్ప్రయుక్తమై; తమర్థమ్ - దాని యీప్సితార్థమును, న ఆహ - చెప్పను. సః - ఇట్లు వ్యుత్క్రమముగాఁ బ్రయోగింపఁబడిన మన్త్ర(వర్ణ)ము, వాగ్వజ్రః - వాగూపమునందిన వజ్రాయుధమై; యజమా

నమ్ - యజమానుని; హినస్తి - నశింపఁజేయును. (ఈ విష యమున నొక దృష్టాన్తమును వివరించుచున్నాఁడు). యథా - ఏవిధముగా; ఇన్ద్రశత్రుః - 'ఇన్ద్రశత్రుః' అను శబ్దము; స్వరతః - స్వరమువలననే; అపరాధాత్ - దోషమువలన (యజమానుని నశింపజేసినదో, యట్లే యపస్వరప్రయుక్త మగు శబ్దము ప్రయోక్తను నశింపఁజేయునని భావము.)

**వ్యా:** స్వరహీనముగాఁగాని, వర్ణహీనముగాఁగాని, యుచ్చరింపఁబడిన మన్త్రము; దాని యర్థమునుఁ దెలుపక పోవుటయే కాక వాగ్వజ్రమై ప్రయోక్తను నశింపఁ జేయునని పలుకుచు నావిధముగా బ్రయోగింపఁబడుటవలన 'ఇన్ద్రశత్రు' శబ్దము యజమానునే నశింపఁజేసినదని యా గాథ నాచార్యుఁడుదాహరించెను. దానిసంగ్రహమిది—

పూర్వమొకప్పుడు త్రిశిరస్కుఁడగు విశ్వరూపుఁడను త. కుమారుని చంపినకారణముగా నింద్రునిపై పగఁ తీర్చుకొను నిమిత్తమింద్రుని జంపువానిం గుమారునిగాఁ బడయుటకై త్వష్ట(విశ్వకర్మ) యొక యాభిచారిక యాగముఁ జేసెను. అందు "ఇంద్రశత్రుర్వర్ధస్వ" యను మన్త్రమూహింపఁ బడెను. "ఓ యగ్నిదేవా నిన్నుద్దేశించి యీ హోమమాచ రింపఁబడుచున్నది. నీవింద్రఘాతుకుడవై మమ్ముల వృద్ధి నొందింపుము" అని దాని యర్థము ఇచట తత్పురుషస్వరము (అన్తోదాత్తము) నకుఁబదులు ఋత్విజులు బహువ్రీహిస్వరము

(ఆద్యుదాత్తము)ను పలికిరి. ఇందు ప్రయోక్త శాతయిత
(చంపువాఁడు) అను తత్పురుషస్వరమన్తోదాత్త మిచట వివక్షి
తము. దానికిఁ బదులుగా ఋత్విజుల జ్ఞానముచే "ఇంద్రుడు వా
నికి శాతయిత యగునో" యను బహువ్రీహ్యర్థప్రదమగు
నాద్యుదాత్తస్వరమును పలికిరి. కావున నా స్వరప్రభావముచే
నింద్రుడే శాతయిత (చంపువాఁడు)అయి వానిఁ సంహరించెను
ఈ విధముగా కొద్దిపాటి స్వరభేదముచేనైనను మహానర్థము
సంభవించవచ్చును. కావుననే వేదమున స్వరమున కంతటి
ప్రాధాన్య మీయఁబడినది.

ఇచట విచారణీయాంశ మొండు కలదు. ఋత్విక్ప్ర
యుక్తమగు నపస్వరోచ్చారణము యజమానుని హననములో
కారణమెట్లైనదని సందేహింపఁ బని లేదు. ఏలన ఋత్విక్ప్ర
యుక్తమగు సాధుశబ్దప్రయోగము యజమానున కెట్లు స్వర్లో
కప్రాప్తిలో హేతువగుచున్నదో అట్లే వారిచేఁ బ్రయోగింప
బడిన యప(స్వర) శబ్దప్రయోగ మాతని వినాశహేతువు
గూడఁ గావచ్చును. మరియునట్టి ఋత్విజులనియమించుట
కూడ నాతనిదోషమే యగును.

ఇంకను నిచటఁగల శత్రుశబ్దము విరోధియను నర్థమున
రూఢమైయున్న శత్రుశబ్దముగాఁ దీసికొనరాదు. అట్లు వైరి
యను నర్థమును వివక్షించినచో తత్పురుష, బహువ్రీహిస్వర
భేదప్రసఙ్గమునకిట తావే లేకపోవలసి వచ్చును. కావుననిచట

శత్రుశబ్దమునకు “శద్లృ శాతనే” యను ధాత్వర్థమును
వివక్షింపవలెను. అప్పుడే “ఇన్ద్రస్య (శాతయితా) శత్రుః; ఇన్ద్రః
శాతయితా యస్య” అను సమాసములు సరిపోవును. మరియు
నీ శ్లోకమున **మన్త్రశబ్దము** శబ్దసామాన్య పరముగాఁ బ్రయో
గింపఁబడినదని గ్రహింపవలెను. కావుననే ప్రసిద్ధమైనదై నప్పటి
కిని నీశ్లోకమును గ్రహించునపుడు భాష్యకారుఁడు ‘మన్త్రో
హీనః’ యని గ్రహించుటకుఁ బదులుగా ‘దుష్టశ్శబ్దః’ యని
గ్రహించినాడు. అట్లైన మరియొక సందియముదయింప
వచ్చును “ఇది మన్త్రమే కానపుడు దానికి హననసామర్థ్య
మెట్లు కలిగినది ? అని—” ఊహాదిశాస్త్రబలముచే నట్టి
సామర్థ్యము కలుగునని తత్త్వజ్ఞులు దానిఁబరిహరించిరి.

దుష్టోచ్చారణమును నిందించుచు నాచార్యుఁడు మఱల
దానిని వారింప నుద్యమించుచున్నాడు:

శ్లో॥ అవక్షరమనాయుష్యం విస్వరం వ్యాధిపీడితం ।
అక్షతా శస్త్రరూపేణ వజ్రం పతతి మస్తకే ॥ 53

**అర్థ:** అవక్షరమ్ - దుష్టాక్షరము; అనాయుష్యమ్ -
ఆయుర్నాశకము (అనగా దుష్టవర్ణప్రయోగమువలన నాయు
ర్నాశము సంభవించునని భావము). విస్వరమ్ - స్వరహీన
ముగా నభ్యసింపబడిన (వేదము); వ్యాధిపీడితమ్ - (చదువరి
ని) వ్యాధిపీడితునిగా (నొనరించునని భావము). అక్షతా -
అకుంఠితమగు; శస్త్రరూపేణ - మారణాయుధమువలె; వజ్రం

(సక్) - వాగ్రూపమగు వజ్రాయుధమై. మస్తకే - (ప్రయో క్తయొక్క) శిరముపై; పతతి - పడుచున్నది.

అనగా నసాధుశబ్దము ప్రయోక్తపాలిట పిడుగుపాటయి (వజ్రాయుధమై), యాతనికి నాశహేతువగునని భావము.

## స్వరజ్ఞానవిహీనుని నింద

**అవ:** స్వరమునను సరించి తగు హస్తాదివిన్యాసములతోఁ గూడిన వేదాధ్యయనమును బ్రశంసించుచు తద్వ్యతిరేకముగా నొనరింపఁబడిన దానిని నిందించుచున్నాడు:

*శ్లో॥ హస్తహీనం తు యోఽధీతే స్వరవర్ణవివర్జితమ్ ।
ఋగ్యజుస్సామభిర్దగ్ధో వియోని మధిగచ్ఛతి ॥ 54

**అర్థ:** యస్తు - యేపాఠకుఁడైతే; హస్తహీనమ్ - ఉదాత్తాదిస్వరనిర్దేశకములగు హస్తవిన్యాసములు లేకుండగను; స్వరవర్ణవివర్జితమ్ - స్వరవర్ణములఁబరిత్యజించియు (వేదమునభ్యసించునో); సః - అతఁడు; ఋగ్యజుస్సామభిః - వేదత్రయముచే; దగ్ధః - దహింపఁబడినవాఁడై; వియోనిం - (శ్వసూకరాది) నికృష్టయోనివిశేషములను; అధిగచ్ఛతి - పొందును.

## స్వరజ్ఞానయుతుని ప్రశంస

**అవ:** సమ్యగ్వేదాధ్యయనముఁ గావించినవాని నాచార్యుఁడిట్లభినుతించుచున్నాఁడు:

---

* ఈ గుర్తుగల శ్లోకములు ప్రక్షిప్తములు

*శ్లో॥ హస్తేన వేదం యోఽధీతే స్వరవర్ణార్థ సంయుతమ్ ।
ఋగ్యజుస్సామభిః పూతో బ్రహ్మలోకే మహీయతే ॥

55

**అర్థ:** యః - ఏపాఠకుఁడు; హస్తేన - ఉదాత్తాది స్వరపరిచాయకమగు హస్తవిన్యాసపూర్వకముగా; వేదమ్ - వేదమును (వేదత్రయినని భావము); స్వరవర్ణార్థసంయుతమ్ - స్వరములు, వర్ణములు, అర్థము వీనితో కలిపి (అనగా వానిని వదలకుండ); అధీతే - అభ్యసించునో; సః - వాఁడు; ఋగ్యజుస్సామభిః - ఋగ్యజుస్సామాత్మకమగు వేదత్రయిచే; పూతః (సన్) - పవిత్రుఁడై, బ్రహ్మలోకే - సత్యలోకము నందు; మహీయతే - పూజింపఁబడుచున్నాఁడు.

**వ్యా:** ఈ శ్లోకద్వయము ప్రక్షిప్తమువలె కనఁబడుచున్నది. ఏలన పైశ్లోకమునకిది పూరకము. మరియు నిది విలోమముగ నదేయాశయమును ప్రబోధించుచున్నది. ఆ పూర్వతనశ్లోకమును, తత్పూర్వశ్లోకమగు "మన్త్రోహీనః" యను శ్లోకము చేతనే గతార్థమగుచున్నది.

## శిక్షోత్పత్తి

**అవ:** ప్రాచీనగ్రంథకర్తలు తమ గ్రంథములకు, దైవీసంప్రదాయమును, దైవీపరంపరను, ఆపాదించి తద్వారా వాని యుత్కృష్టతనుఁ దెలుపుకొనుట పరిపాటియైయున్నది. పరమేశ్వరవరప్రసాదలబ్ధ ఈ సంప్రదాయమునననుసరించియో,

---

* ప్రక్షిప్తము.

మహిమాన్వితుఁడగు నాచార్యుఁడు తన గ్రంథసంప్రదాయ మును, ఆనుపూర్వకముగా నిట్లుపవర్ణించుచున్నాఁడు

శ్లో॥ శంకరః శాంకరీం ప్రాదా ద్దాక్షీపుత్రాయ ధీమతే ।
వాఙ్మయేభ్యః సమాహృత్య దైవీం వాచమితిస్థితిః ॥ 56

**అర్థ:** శంకరః - పరమశివుఁడు; వాఙ్మయేభ్యః - వేదములనుండి; సమాహృత్య - ఏకీకరణముఁగావించి; శాంకరీమ్ - స్వసంబంధమగు; దైవీంవాచమ్ - (శిక్షాస్వరూపమగు) దేవవాణీవిద్యను; ధీమతే - బుద్ధికుశలుఁడగు; దాక్షీపుత్రాయ - దాక్షీపుత్రుఁడగు పాణిన్యాచార్యునకు; ప్రాదాత్ - ఇచ్చెను; ఇతి - అని; స్థితిః - సంప్రదాయము.

## మ ఙ్గ ళా చ ర ణ ము

**అవ:** శాస్త్రములు సాధారణముగా సన్మఙ్గళారబ్ధములై, మఙ్గళాన్తములుఁగా ప్రణయింపఁబడుట యనునది మన సంప్రదాయము. ఏతదనుసారమాచార్యుఁడు తన గ్రంథ పరిసమాప్తియందు తనను ద్దేశించి శిష్యగణ మనుదినమాచరించు గురువందన మిందు పొందుపరచి యున్నాఁడు. ఇయ్యది శ్లోకత్రయాత్మకమై యిట్లలరారుచున్నది:

*శ్లో॥ యేనాక్షరసమామ్నాయ మధిగమ్య మహేశ్వరాత్ ।
కృత్స్నం వ్యాకరణం ప్రోక్తం తస్మై పాణినయే నమః ॥ 57

---

* ప్రక్షిప్తము.

*శ్లో॥ యేన ధౌతాగిరః పుంసాం విమలైశ్శబ్దవారిభిః ।
తమశ్చాజ్ఞానజం భిన్నం తస్మై పాణినయే నమః ॥58

**అర్థ:** యేన - ఏయాచార్యునిచే; విమలైః - పరిశుభ్రములైన; శబ్దవారిభిః - శబ్దములనెడు జలములచే; పుంసామ్ - పురుషులయొక్క; గిరః - వాక్కులు; ధౌతాః - ప్రక్షాళనగావింపఁబడినవో (శుద్ధములైనవో) మఱియు; అజ్ఞానజమ్ - అజ్ఞానమువలనఁబుట్టిన; తమః - అన్ధకారము; భిన్నమ్ - పోగొట్టఁబడినదో; తస్మై - అట్టి (జగదుపకర్తయగు); పాణినయే - పాణిన్యాచార్యునికొఱకు; నమః - నమస్కారము.

*శ్లో॥ అజ్ఞానాంధస్య లోకస్య జ్ఞానాఞ్జనశలాకయా ।
చక్షురున్మీలితం యేన తస్మై పాణినయే నమః ॥ 59

**అర్థ:** జ్ఞానాఞ్జనశలాకయా - జ్ఞానమనెడి కాటుకపుల్లచే; అజ్ఞానాంధస్య - అజ్ఞానముచే గ్రుడ్డిదైన; లోకస్య - ప్రపంచముయొక్క; చక్షుః - కన్ను; యేన - ఏయాచార్యునిచే; ఉన్మీలితమ్ - తెరిపించబడినదో; తస్మై - అట్టి; పాణినయే - జగదుపకర్తయగు పాణిన్యాచార్యునకు; నమః - నమస్కారము. (భావము స్పష్టము.)

ఈవిధముగా 'మఙ్గళాదీని మఙ్గళమధ్యాని, మఙ్గళాన్తాని చ శాస్త్రాణి ప్రథన్తే'*—ఇత్యాది సంప్రదాయమునను సరించి

---

* శాస్త్రములాదిమధ్యాన్తములందు మంగళములఁ దలిగి ప్రసిద్ధినిఁబడయును.

* ప్రక్షిప్తము.

యాచార్యుఁడాత్మస్తుతి రూపమగు శిష్యకృతమజ్గళమును గ్రంథాన్తమున స్వీకరించెను. ఇచట నీ యాశయము చర్చ నీయమై యున్నది.

ఆచార్యుఁడీశ్లోకములను శిష్యప్రణీతములుగా ప్రవచింపలేదు. అట్లైన, విరాగియగు కావుననివి యాతనివైనను కావచ్చును. అట్లైన, విరాగియగు నామహర్షి స్వగ్రంథమున నాత్మప్రశంస గావించుకొనుట యనుచితముగా కొందరకుఁ దోఁచును. దీని కిట్లు సమాధానముఁ జెప్పవచ్చును. ఆత్మకృత నమస్కారమును వేదాన్తపరముగా సమర్థింపవచ్చును. ఏలన జీవాత్మస్వరూపుఁడగు నాచార్యుఁడు పరబ్రహ్మస్వరూపుఁడగు తన యన్తఃస్వరూపము నుద్దేశించి తన్మతానుసారముగా నమస్కరించెనని చెప్పవచ్చును. ఎట్లన జీవభూతుఁడగు ప్రాణివిషయమున నీనమస్కృతి కర్తగను, ప్రాణివిపదలక్ష్యుఁడగు బ్రహ్మస్వరూపవిషయమున కర్మగను యన్వయించును. ఈ స్థలమున నిర్గుణుఁడును, నిరాకారుఁడునునగు పరబ్రహ్మకు నమస్కారవిషయత్వమెట్లు పొసగునని సంశయింపఁ బనిలేదు. బ్రహ్మపదార్థము సోపాధికమై, సర్వజ్ఞత్వాది (కేవలాన్వయి) విశిష్టముగా నంగీకరింపఁ బడుటచే నీ సందియమున కవకాశముండదు. కావుననే జీవ, బ్రహ్మపరస్పరైక్యప్రతిపాదకమగునద్వైత సిద్ధాన్తమునఁగూడ నిదేవాదముపై నమస్కారోపపత్తి సాధింపఁబడినది.

ఈ విషయమున నింతశాస్త్రీయముగాఁ పూర్వపక్ష సిద్ధాన్తములఁ బెంచుకొనుటకంటె పైఁ జెప్పినయట్లు శిష్యకృత మఙ్గళశ్లోకముల నాచార్యుఁడు, తన గ్రంథాన్తమున స్వీకరించె నని సమన్వయించుకొనిన సులభతరముగా నుండును. ప్రాచీ నాచార్యులీవిధముగా శిష్యకృతములగు స్తుతులను తమ గ్రంథములందు చేర్చికొను నాచారము కలదు. ఈ యాచార ము ననుసరించియే యాచార్యః వాచస్పతిమిశ్రులు, తమ భామతీప్రబంధమున

శ్లో॥ శఙ్కే సంప్రతి నిర్విశఙ్క మధునా స్వారాజ్య సౌఖ్యం వహన్

నేన్ద్రః సాన్ద్రతపఃస్థితేషు కథమప్యుద్వేగమభ్యేష్యతి।

యద్వాచస్పతిమిశ్రనిర్మితవ్యాఖ్యానమాత్రస్ఫుటత్

వేదాన్తార్థవివేకవఞ్చితధియాస్స్వర్గేప్యమీ నిస్పృహాః॥

అను శిష్యకృత మఙ్గళాచరణమును గ్రహించిరి. ఆచార్యుఁడు గూడ నిట్లే శిష్యవాత్సల్యముచే తత్కృతః స్తుతిశ్లోకములఁ గ్రంథాన్తమున స్వీకరించెనని యూహించుటలో విప్రతిపత్తి గోచరింపదు. సహృదయులగు పాఠకమహాశయులు వారివారి యభిరుచులననుసరించి యేదోయొకరీతిని సమన్వయించు కొందురుగాక!

## ఫలశ్రుతి

ఆప: గ్రంథాంతమున ప్రాచీనసంప్రదాయముననను

సరించి, ఫుల్రసతినాచార్యుఁడు వివరించుచున్నాఁడు:

శ్లో॥ త్రినయనమభిముఖ నిస్సృతామిమాం
య ఇహ పఠేత్ప్రియతశ్చ సదాద్విజః
స భవతి ధనధాన్యపశుపుత్రకీర్తిమాన్
అతులం చ సుఖమశ్నుతే దివీతి దివీతి ॥ 60

అర్థ: యః - ఏ; ద్విజః - ద్విజుఁడు (బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యాన్యతముఁడు); ప్రయుతః - జితేన్ద్రియుఁడై; త్రినయనమభిముఖనిఃసృతాం - పరమశివుని వదనమునుండి వెలువడిన; ఇమామ్ - ఈ శిక్షాగ్రంథమును పఠేత్ - పఠించునో; సః - అతఁడు; సదా - ఎల్లప్పుడును ధనధాన్యపశుపుత్రకీర్తిమాన్ - ధన, ధాన్య, పశు, పుత్రసంపదలఁగలిగికీర్తిమంతుఁడై (ఇహలోకమునను); దివి - స్వర్గమున; అతులమ్- అనుపమమగు; సుఖమ్ - సుఖమును (అనగా బ్రహ్మానందమును); అశ్నుతే - అనుభవించునని భావము.

ఈ శ్లోకమున 'దివీతి దివీతి' యనుద్విరుక్తిగ్రంథాన్తమును సూచించును ఈ శిక్షాగ్రంథముగూడ శాస్త్రగ్రంథమే. ప్రతి శాస్త్రగ్రంథమునను విషయాధికారిప్రయోజనములుపవర్ణింపఁబడును. ఇంత దనుక నీగ్రంథమున విషయమే వివరింపఁబడినది. ప్రాసఙ్గికముగా వర్ణోచ్చారణవిషయమున ఫలనిర్దేశము జరిగినప్పటికిని ఇది శిక్షాశాస్త్రపఠనప్రయోజనముగా చెప్పఁబడలేదు గాన నీశ్లోకమున నే తచ్ఛాస్త్రమునకు ద్విజునధికారిగను, దీనిని శ్రద్ధాసక్తులతో నభ్యసించిన యాతనికి

హికాముష్మికములగు సుకృతసుఖములుఁ గలుగుననియు నాచార్యుఁడు వివరించినాఁడు.

## ఉపసంహారము - శ్లోకసంఖ్య

**అవ:** ఈ విధముగా ఫలప్రాప్త్యధికారి నిర్దేశముఁ గావించి గ్రన్థపరిసమాప్త్యనన్తరమాచార్యుఁడు గ్రన్థార్థగతశ్లోక సంఖ్యనిట్లు వివరించుచున్నాఁడు:

శ్లో॥ అథ శిక్షామాత్మోదాత్తశ్చ హాకారం స్వరాణాం యథా।
గీత్యుచోష్ప్రష్టోదాత్తం చాపస్తు శజ్కర ఏకాదశ ॥61

ఈ పాణినీయశిక్షాగ్రంథము ఏకాదశఖండాత్మకమైనది. ప్రతిఖండమునకైదేసిశ్లోకములు చొప్పున వెరసి ఇందేబదియైదు శ్లోకములున్నవి. వాని నీ శ్లోకమూలమున నాచార్యుడిట్లు తెలుపుతు చేయుచున్నాఁడు:

1) 'అథశిక్షాం ప్రవక్ష్యామి' అను 1 వశ్లోకము మొదలుకొని యైదుశ్లోకములు ప్రథమఖండమని భావము. 2)'ఆత్మాబుధ్వా సమేత్యర్థాన్' అను 6 వశ్లోకము మొదలైదుశ్లోకములు కలసి ద్వితీయఖండము. 3) 'ఉదాత్తశ్చానుదాత్తశ్చ' అను 11వ శ్లోకమునుండి యైదుశ్లోకములు తృతీయఖండము. 4) 'హకారం పఞ్చమైర్యుక్త'మను 16వ శ్లోకమునుండి యైదుశ్లోకములు చతుర్థఖండము. 5) ఇట్లే 'స్వరాణామూష్మణాఞ్చైవ' అను'

21వశ్లోకము 6) 'యథాసారాప్తి)కాహారి' శ్లో 26 7) 'గీతీశీఘ్రి' శ్లో 32, 8) 'అచోఽస్పృష్టో' శ్లో 38, 9) 'ఉదాత్తమ్' శ్లో 43, 10) 'చాప స్తువద తే' శ్లో 49, 11) 'శంకరః శాంకరీం ప్రాహ' శ్లో 56, అనుశ్లోకములాదిగా నైదేసి శ్లోకములు చొప్పన నేకాదశఖండములుఁ దెలియఁదగినవి.

కాని యీగ్రంథమున నాలు శ్లోకములధికములుగాఁ జూపట్టుచున్నవి. కాన వీనిలో నేవోయాలు ప్రక్షిప్తములుగా నున్నవని చెప్పనొప్పను. ప్రక్షిప్తములని చెప్పుటకవకాశము న్నవానిని (*)గుర్తులుంచి వ్యాఖ్యానించితిని. వానియుక్తాయుక్తతలను సహృదయులగుపాఠకులు యోచింతురుగాత!

మఙ్గళం మహత్.

సర్వం

శ్రీపరదేవతార్పణమస్తు

